భోరాశిం దఱియం జొచ్చిరి
వీరాగ్రణి సాత్యకియును ♦ విజయసుతుండున్. 106

క. ఘోదివిశోని శకునిబల ము
న్మదగతి సాత్యకి రథంబు ♦ నఱికిన నాతం
డది దిగ్గదాఁటి శైరా
స్పదమతి నభిమన్యు తేరి ♦ పైకిం జనియెన్. 107

క. వారిరువురుఁ జలమున గాం
ధారపతి ప్రముఖ రథిక ♦ తతులంజంచ
న్నారాచతతుల నొంచిరి
క్రూరతఁ గవిసెన్ యుధిష్ఠి ♦ రుఁడు భీష్మునిపయిన్. 108

క. భూరిబలఘోర మగునా
భూరమఃనుని కోలుతలకుఁ ♦ బోవక భీష్మ
స్ఫారబలము ద్రోణుని దో
స్సారంబును నచ్చి నీదు ♦ సైన్యము పెనగెన్. 109

దుర్యోధనుఁడు భీమునితో యుద్ధముసేసి మూర్ఛిల్లుట.

చ. తదవసరంబునం బతి యు ♦ దగ్రత భీమునిఁ దాఁకి విస్ఫుర
త్ప్రదరములేసినన్ నగుచుఁ ♦ బాండవవీరుఁడు రాజువేఁన బె
ట్టిదమగు బాణమొక్కటివ ♦డింగొనితూఱఁగ నేయఁ దేరిపైఁ
జదికిలఁబడ్డమూర్ఛ నృప ♦ సత్తము లేవఁగనీక కప్పినన్.

ఆ. సంభ్రమమున నపుడు ♦ సారథి యాచోటు
దొలఁగఁ బెలుచఁ దేరు ♦ దోలుటయును

గని భయంబు నొంది ♦ కలఁగి యొక్కుమ్మడి
బలము లెల్లఁ బెరలి, పాఱఁ జొచ్చె. 111

క. వెనుకొని విఱిగిన సైన్యము
గనుకనిఁ బొఱంగఁ జేసి ♦ క్రూరోగ్రదేశం
బున ధృష్టద్యుమ్నుండును
దనకెలనం దఱుము వాయు ♦ తనయుం డెగచెన్. 112

క. అదలిచి ద్రోణుఁడు భీష్ముఁడు
మదమున నిలు నిలు మనంగ ♦ మఱియును మొగక
ట్టద సేన భీమసేనుఁడు
గడిసి పిఱుఁద నంట నార్వఁ ♦ గౌరవనాథా. 113

క. సభయ మగు శకుని సైన్యం
బభిమన్యుఁడు సాత్యకియు ర ♦ యంబునఁ దోలం
బ్రభ సెడి పఱచుట గని యా
ప్రభువు చలం బెడలి విఱిగె ♦ బంధులుఁ దానున్. 114

క. ఊర్జితశాత్రవసేనా
దుర్జయుఁ డగు నర్జునుండు ♦ దోర్బలలీలా
స్ఫూర్జితుఁడై యొక్కదెసఁ
గర్జారౌద్రముగఁ దోలెఁ ♦ గౌరవబలమున్. 115

తే. అంతఁ దెప్పిఱి నీకొడు ♦ కనికి రథము
దోలఁగఁ దెచ్చుట గనుఁగొని ♦ యలిగి సూతుఁ
బలికి సరభసముగ నడు ♦ కలని కేఁగి
మెలుఁగు సూపిన బలములు ♦ నిలిచి పొదివె. 116

తే. ఉన్నచోటన కదలక ♦ యున్నద్రోణ
భీష్ములును గోలుతల సేయఁ, బెట్టిగి సేన
చంద్రుఁ డుదయింపఁ బెటిగిన ♦ శరధియట్లు,
దోడుతోడుతఁబొంగారి ♦ చూడనొప్పె. 117

వ. ఇట్లు బలంబుల నిలిపి సుయోధనుండు సత్వరంబుగా భీష్మ
ద్రోణులపాలికిం జని వారలతో నిట్లనియె. 118

ఉ. ఉక్కున మూఁడులోకములు ♦ నొక్కటఁ దాఁకెనయేనిఁ
బోర మీ | రొక్కఁడొకండ గెల్చుటకు ♦ నోపుదు రట్ల
మవృత్తి నిట్లు మీ | ముక్కున నూర్పు గల్గ మన ♦ మో
హార మీదురవస్థఁ బొందునే | యక్కట యున్న పాండవు
ల, కల్గఁగ నొల్లమి సెప్పరె తరే. 119

వ. అని పలికి గాంగేయుం గనుంగొని. 120

ఆ. నాఁడె చెప్పఁగన్న ♦ నాకు రాధేయున
కెట్లు సూడఁ బోలె ♦ నట్లుపోలెఁ
బడినపాటుఁ బడుదు ♦ మడియాస నీచేతఁ,
భంగపడితి మింకఁ ♦ బలుకు లేల. 121

వ. అనినవిని చిఱునవ్వునవ్వుచు మీతండ్రి నీకొడుకును బ్రియ
భాషణంబులం దేర్చి యిట్లనియె. 122

క. పురుహూతసహిత మగుని,
ర్జరబలమున కైన గెలువ ♦ శక్యమె సమర
స్థిరు లగుపాండుతనూజుల,
నరనాయక నీకు నిట్ల ♦ నం దగ వగునే. 123

జఱచుగఁ గూలిన కరులు
గ్గిరికోనమెన్ సమరమేది ♦ నీతలమెల్లన్. 136

వ. ఇవ్విధంబున విషమంబగు రణభూభాగంబునం జరియింపం జతురులుగాక రథికజను లంతంతగుంపులుగట్టిరి గాంగేయుం డుప్రతియోధులం బేరు వేరంబిలుచుచు నుక్కుమిగిలిదిక్కులమ్ములం బిక్కటిల్లంజేయుచు నెక్కడఁ జూచినం దానయై మెఱుంగు మెఱసిన తెఱంగునం గొఱవి ద్రిప్పిన యొప్పున నింద్రజాలంబు సూపిన చందంబునం దన రథంబు మెఱయ శక్తి శౌర్యంబులు నెఱయ నెవ్వరికిని నిలువరింపరాక యెదిరిన రూపంబులం బెక్కంటి నొక్క బాణంబునం బెక్కుబాణంబుల నొక్కంటిఁ గూల్చి కేలిసలుపుచు నఱిమి పయింబడిన వీరులం గీలెడలినజంత్రంబులుంబోలె నేలంగూలనేయుచు ధ్వజఛత్త్రలక్ష్య శుద్ధిలాఘవంబులం వియచ్చరులు పిచ్చలింప ననేకప్రకారంబులగు క్రూరశరంబులఁ జతురంగంబులం దునియలుం బఱియలుం దుమురులు గుదులునై బడలువడం జేయుచుం గార్చిచ్చు పొదివిన పోలిక మాయ గావించిన మాడ్కి మంత్రించిపడవైచినపగిదిం గసిమసంగి కౌంతేయ సేనం గనుపుకొట్టుచుఁ బ్రళయకాలతాండవ ప్రవర్తియైన ఫాలలోచనులీల నాజిరంగంబునం బరాక్రమనృత్యంబు సేయుచున్నం బాంచాలయాదవాది యోధులు వెఱఁగుపడి చూచుచుండఁ బాండవులునుం జేయునదిలేక చేష్టలు దక్కినం దదీయసైన్యంబులు రూపఱి భయభ్రాంతంబులై దీనదశవ

నచ్చె నప్పుడు శౌరి యుగ్యంబులఁ బగ్గంబులఁబట్టి పార్థుతో
నిట్లనియె. 137

చ. కృపగురుభీష్మయుక్తముగ ♦ గెల్తు సుయోధను సేననంచు నీ
వపరిమితోగ్రశక్తి మెఱ♦యం దఱి గోరుచునుండు దెప్పుడుం
గుపితయుగాంత రుద్రుగతిఁ ♦ గోలుమసంగినవాఁడు భీష్ముఁ డే
చిపటుభుజాబలంబువిల♦సిల్లఁగ మార్కొనకున్కి యొప్పునే.

అర్జునుఁడు శ్రీకృష్ణప్రేరితుండై భీష్ముపై గవియుట.

క. అనిన విని యర్జునుం డి
ట్లను నీచింతనఁగ నేల ♦ యాతనిమీఁదన్
మనరథముఁ బఱపు మిప్పుడ
సునిశితబాణముల నతని ♦ సొంపడఁగింతున్. 139

చ. అనుటయు నట్ల శౌరి యని ♦ యచ్యుతుఁ డుద్ధతిఁ దేరు
వోవ ని । చ్చినఁ గని పొంగి యారథిక ♦ సింహుఁడు దుస్సం
చిత సింహనాదుఁడై । నినిచెఁ దురంగదేహములు ♦ నీరజ
నాభుని మేనఁ బాఁడునం । దనునొడలం బ్రదీప్తఘన ♦
దారుణమార్గణపుంజముల్ సడిన్. 140

తే. తనదునొవ్వున కలుకక ♦ ధైర్యవృత్తి
నయ్యుపేంద్రుండు నొచ్చిన ♦ హయచయంబుఁ
దడవి తేర్చి యుదగ్రతఁ ♦ దఱుముటయును
గుణరవం బుల్లసిల్ల ఫ ♦ ల్గునుఁడు గడఁగి. 141

క. భల్లం బొకటఁ బితామహు
విల్లు దునుమ వే ఱొకండు ♦ వెన నెత్తిన న

విల్లును దునిమిన లాఘవ
ముల్లంబునఁ బొగడి యేసె ♦ నొండొకవింటన్. 142

తే. ఇట్లు గాంగేయుఁ డేయున ♦ నేకవిశిఖ
వితతి యసురారి రథచిత్ర ♦ గతులుదప్పి
పోవఁ జేయంగ నతఁ డంతఁ ♦ బోకనొంచె
నరుస నారాయణుని బలు ♦ నారసముల. 143

క. నొచ్చియు భీష్మునిపై వి
వ్వచ్చుఁడు బెడిదముగఁ గురిసె ♦ వాలమ్ములతం
డచ్చెరువుతోడ వెసఁ గా
ర్చిచ్చు గవిసినట్లు పొదివె ♦ శితవిశిఖములన్. 144

వ. అంత నపరాహ్ణం బయ్యె నట్టియెడ. 145

క. హరి దాను నొచ్చి నొచ్చిన
నరుని తెఱం గెఱిఁగి భీష్ము ♦ నకు నించుకయుం
గరలాఘవ మెడలమియుం
దిర మైె పరికించి తనమ ♦ దిం దలపోయున్.  146

ఉ. పాండవసైన్యముల్ గలఁగి ♦ పాఱెడు సిగ్గటి వీరిలోన నొ
క్కండును భీష్ము మార్కొని మ♦ గంటిమి సూఁపగలేఁ డ
యుగ్ర|దవు | |తుండును జాల నొ వ్వడరి ♦ తూగెడు నిట్టిప
ద్మైన నేఁడ తీ ! ర్చంజె యితండు కౌరవన్ప ♦ పాలుపమ
స్త మనోరథంబులున్. 147

క. యాదవ కేకయపాంచా
లాదులు వాఱుటలు సూచి ♦ యస మెక్కి జ ఘో

న్నాదంబునఁ గురుసైన్యము
లేదిక్కునఁ దామ యగుచు ♦ నేడ్తెఱఁ బొలిసెన్. 148

వ. ఇప్పుడే నూరకున్నం బోవదీ దేవవ్రతుం జంపి ధర్మతనయు
గెలిపింప వలయునని యిట్లు దలపోయునెడ మఱియు మం
దాకినీనందనుండు బెట్టిదమ్ములగు నారసమ్ములు గురియం
దేఁకువ సెడి క్రీడి యున్నంగని కృపకృతవర్మాశ్వత్థామలు
ను భూరిశ్రవ సైంధవవికర్ణులును నొక్కమొగంబై రథ
మ్ముల మొత్తమ్ములతోడం గడగి వచ్చి కవ్వడిపయింబడి
నాసమయంబున సాత్యకి సామజఘటలతో నురవడించి
యిరు గెలంకులయోధుల నాలోకించి. 149

క. మఱతురె యాడినమాటలు
పిఱుసని పోఁ దగునె మీకు ♦ బెదరక యెదురై
తెఱువుఁడు భీష్మునిఁ గీష్మని
నెఱుఁగరె మున్నేను గలుగ ♦ నేలా వెఱవన్. 150

వ. అనుచు నేచి యెదిరినబలంబుల నిలు నిలు మని యదల్చు
చునర్జును తేరికిం దల కడచి వచ్చు నతనికి దనుజాంతకుం
డిట్లనియె. 151

క. తిరిగిన పందల నేటికిఁ
బురికొల్పఁగ నున్నవారు ♦ వోదురు గాకేఁ
గురుపతి జయంబు గోని యి
ద్ధర యేలం జూడ నేర్చె ♦ దని విను నన్నున్. 152

శా. గంగానందనుఁ గూల్చి ద్రోణుపని స ♦ క్కంజేసి కౌర
వ్యవీ రాంగమ్ముల నుఱుమాడి తత్పుత్రిబలసై ♦ న్యంబెల్ల

మాయించి యీ । శ్రుంగాంతేయుల కిమ్మహీవలయమున్ ♦
మద్గాత్రచంచద్భుజా । సంగస్ఫూర్జిత చక్రవిక్రమకళా ♦
సంక్రీడనోన్మాది నై. 153

—* శ్రీకృష్ణుండు చక్రంబు ధరించి భీష్మునిమీఁదికి నుఱుకుట. *—

వ. అని పలికి సుదర్శనంబుం దలంచినం దత్క్షణంబ యది సన్నిహితం బగుటయుం బద్మనాభుండు సునాభం బగు నాచక్రంబు గైకొని దక్షిణకరంబున నమర్చి పేర్చి యుగ్రాంబుల పగ్గంబులు నొగల మఱచి యరదంబు డిగ్గ నుఱికి. 154

తే. అవని గంపింప లలిత పీ ♦ తాంబరంబు
చెఱఁగు మూలఁ జక్రాంశులు ♦ మెఱుఁగులింప
సింహనాదంబు క్రోధరం ♦ జితభయాంక
దానవంబునఁ జెలఁగంగ ♦ నడచె నెలుచ. 155

శా. ఆహాహామర్దనుఁ డాజనార్దనుఁడు మా ♦ ద్యద్భీష్మకుం
భీంద్రుపై । సింహోల్లాసవిభాసియై కవియుచు । న్నేకంబు నాటోపమున్ । రంహస్ఫూర్తియు నీషమూర్తియు ను సం ♦ రంభంబుఁ జూడన్ జగ । త్సంహారోన్ముఖుఁడైన రుద్రుఁగతి రా ♦ వ్రపక్రియం బొల్చినన్. 156

చ. పులిఁ బొడగన్న లేళ్లగమి ♦ వోలె సుయోధను నగ్గసైనికుల్
దలఁకి కలంగి నివ్వెఱ గు ♦ దన్కఁగ జేష్టలు దక్కి చిత్తరు
పై । పులక్రియ నుండి రక్కురువి ♦ భుండును మాఱు
దలంప లేనికో । దలమునఁ బొందుడెందమునఁ దానును
రూపఱి యుండె జెల్లనై. 157

ఉ. అప్పుడు భీష్ముఁ డొంతయుఁ బ్రియంబున నిట్లను సంభ్రమంబు లే | కప్పరమేశుతో నిటు కృతార్థునిఁ జేయుదె నీవు వచ్చి శ | స్త్రప్పుడు నీకుఁ బోలినటు లెల్లను జేయుదుగాని వేగ ర | మ్మెప్పుడె నాకు నిట్టి తెఱఁ గుజ్జ్వలపుల్లసరోజలోచనా 158

వ. అని నట్టియెడ నర్జునుండు రయంబు రథంబున డిగ్గి నుఱికి పఱచి పురుషోత్తము పిఱిందిదెసం గ్రుచ్చిపట్టిన నతండు దీర్ఘబాహుండగుటవలన నాయతశాఖం బగువిపులశాఖం గొని పోవుమహావాతంబునుంబోలెఁ గొనిపోవ నాతండు పదియడుగులకొలంది నిలాతలంబు చిక్కుఁ ద్రొక్కి యీడిగిలఁబడి నిలువం బట్టి యిట్లనియె. 159

ఉ. కోపము సంహరింపు యదుకుంజర పాండవకోటి కెల్లనుం దేవు గావె నీవిటుల ధీరతఁ బూనికి వచ్చినం బ్రతిజ్ఞాపరుఁ డైనధర్మసుతు శౌర్యము ధైర్యము బాహువీర్యముం | హా పఱిపోక కాదె యను రూపనె నీ కిది లోకనాయకా 160

చ ఇటు దగు నయ్యుకృష్ణ శమి యింపుము సాత్యకిఁ జంపి నాఁడ విం | కట చనితేని నీదగుస హాయతఁ గౌరసేన రూపు మా | పుల యవలీల నాకు ననుఁ బోల్పుగఁ జేయుట నీకుఁ బాడియే | కటకట నాపరాక్రమము గాసిగఁ జక్రము చేత నంటితే. 161

వ. అనిన సవ్యసాచి సమయనిష్ఠకు శౌరి సంతోషించి రోషం బుపశమించుకొని యతనికిం బ్రియంబుగా మగిడి నొగలపైకి

వచ్చి దిక్కులు పిక్కటిల్లఁ బాంచజన్యంబు పూరింప
నాధనంజయుండును దేవదత్తం బొత్తి గాండీవ గుణచండ
నిస్వనం బొండొండ నిగిడించుటయుం గౌరవబలంబులు
భేరీ మృదంగాది తూర్యనాదంబులు సెలంగ మార్కొని
కడంగిన. 162

క. అగ్గలిక దూరి దరికొను
నగ్గికెలిం గమర నప్పు ◆ డర్జునుఁడు గడం
డగ్గఱి మెఱుంగుటమ్ముల
గ్రమ్మించె వియచ్చరోత్క ◆ రం బగ్గింపన్. 163

వ. ఆసేనకుం దలకడచి భీష్మభూరిశ్రవశ్శల్యదుర్యోధనులడరి యు
ర్జునుపై శక్తిగదాసప్త నారాచతోమరంబులు ప్రయో
గించిన నతండు శక్తియు గదయును దోమరంబును నొ
క్కొక్క భల్లంబునను నేడు నారాచంబు లేడింటను దు
నిమి పేర్చి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన నది నానా
ప్రకార క్రూరశరకలాప రూపంబునం గవిసి కౌరవసై
న్యంబు నొప్పింప మఱియును దాను మందాకినీ నందను
నిశితనారాచ జాలంబునం బొదివి భూరిశ్రవసునిచాపంబు
ద్రుంచి తొమ్మిదివాలమ్ములు శల్యుమేనం గీలించి కురుపతి
వక్షంబు వెడందవాతియమ్మున భేదించె నప్పుడు పాంచాల
పతి విరాటప్రముఖు లగుజోదులు గోలుతల సేసిరి మన
బలంబులు గాండీవగుణ నిష్ఠుర నినదంబునం జేష్పడి యొ
ల్లంబోయి వెల్లనయి యుండ భవదీయసుతులు శౌర్యో

దేశికంబున నాకేశనందను నరదంబుఁ బొదివి రట్టి సం
కుల సమరంబున మహేంద్రబాణంబుచేత మనదిక్కున.

ఆ. కెడసె హయము లొడ్డ • గెడవయ్యె రథములు
చాఁపకట్టువడిమె • సామజములు
చనసెఁ గాల్బలము • చామరచ్ఛత్త్రకే
తువులు నాయుధములుఁ • దునియలయ్యె. 165

వ. అప్పు డర్జునుండు కేశకలాపంబు శైవాలంబును బ్రేవుల
ప్రోవులు ఫేనపుంజంబులును మేదోమాంస మస్తిష్కప
టలంబు పంకంబును నగు రక్తనదీ ప్రవాహంబు భవదీయ
సేనామధ్యంబునం బఱపి భేతాళ క్రవ్యాదాది భూతంబుల
నోలలార్చి నతండు దేవదత్తంబును దామోదరుండు పాం
చజన్యంబును బూరించి సింహనాదంబులుసేసి రంత నరుణ
గభస్తి యస్తగిరి మస్తకాంతరితుం డయ్యె నాసంధ్యా
సమయంబున నిజసైన్యంబునొవ్వనుం గవ్వడిదివ్యబాణ
జాలంబుల దుర్నివారత్వంబును విచారించి భీష్మద్రోణ
బాహ్లీక దుర్యోధనులు బలంబులఁ దివియించి మరలి
కరదీపికలు వెలుంగ విడిదలకు వచ్చిరి పాండవులును గృ
ష్ణసహితంబుగా నభ్యునం బొంగుచు వందిజనకీర్తనంబు
లు శెలంగ మగిడి శిబిరంబునకుం జని రమ్మాండవనాఁటి
రాత్రి గురుపతపిటిజనంబులు గిరీటపరాక్రమ ప్రకారంబు
లం దమదెస నానాదేశంబుల చతురంగంబులు వ్రాలిసిన
వెల్లును నంతంతం గుములుగట్టి చెప్పికొనుచుండ. 166

—* భీష్ముని చతుర్థదివస యుద్ధము. *—

క. వేగుటయు సత్వరంబుగ
నాగాంగేయుండు మించి ♦ యనికి నడచినన్
సాగర తరంగములగతి
వేగము తరతరమ మొనలు ♦ వెడలఁ దొడంగెన్. 167

క. అతిరయమున గురుఁడు భవ
త్సుతుఁడును బాహ్లికుఁడు నెయిద ♦ తోడ్తో బలసం
తతి గూడికొనఁగఁ బటుబృం
హితహేషానేమిరవము ♦ లెసఁగెం దఱచై. 168

క. కారుకొని మేఘమాలా
కారంబునఁ జాల నొప్పెఁ ♦ గౌరవసైన్యం
బారూఢవీరరస వి
స్ఫారంబై యంతఁ దోఁచెఁ ♦ బాండవబలమున్. 169

క. కురుసేనఁ జూచి యప్పుడు
నరనారాయణులు దమమొ ♦ నకు మిగిలి సను
ద్ధురలీల సూర్యచంద్ర
స్ఫురణము లొక్కెడన మెఱయు ♦ పోలిక నమరన్. 170

క. వెలిఁగిరి బలములుఁ దూర్యం,
బులు నార్పులుఁ జెలఁగ రెండుఁ ♦ బురికొని చతురం
గలసద్గతు లొప్పఁగ వడిఁ,
దలపడియెం గైదువుల న ♦ దరు లెగయంగాన్. 171

వ. ఇట్లు దాఁకి తోమరప్రాసప్రముఖంబుల డొల్లవైచుచుఁ గుంతక్షురికాదులఁ గూలం బొడుచుచుం గరవాలపరశ్వధ

ప్రభృతులం దునుముచు వ్రేయుచు గదా ముసలముద్గరంబులం
జదియ మోఁదుచు నఖగప్రాసంబులం బగుల వ్రచ్చుచు.

క. పురికొనుచుం దెరలుచు నొ,
హరిసాహరి నొక్కచోట ♦ నలవడు నొకచో
విరియ నొకచోటఁ దిరుగుం,
దిరుగక యొకచోట రెండు ♦ దెఱఁగులు నొచ్చున్.

క. పలుచోటులఁ బలుభంగులఁ,
బలుమొన లిమ్మాడ్కిఁ బోరఁ ♦ బార్థునిపై న
గ్గలిక నడరెఁ దాటిసిడము,
తలతలమని మెఱయఁ గురుపి ♦ తామహుఁ డధిపా.

క. పతియును ద్రోణుండు వివిం
శతియుఁ గృతిశోమదత్త ♦ శల్యులుగంగా
సుతుతోడఁ గడఁగి నర్జున
సుతుఁ డయ్యేశ్వరను దాఁకె ♦ సురలు నుతింపన్. 175

క. వారల శరని చయము ను
ర్వారవిశిఖ పంక్తిఁ దునిమి ♦ వాసవపౌత్రుం
డారూఢ తేజుఁడై వెలుఁ
గారెను హుతవహ్ని క్రియ ర ♦ ణాంగణవేదిన్. 176

తే. భీష్ముఁ డభిమన్యుఁ గడచి యా ♦ భీలబాణ
జాలములు దీవ్రతరముగ ♦ సవ్యసాచి
మీఁదఁ గురియంగ నాతఁడ ♦ మేయభల్ల
తతులనన్నింటిఁ దునుమాడెఁ ♦ దరతరంబ 177

వ. ఇట్లు దొడంగి యుద్ధప్రకారంబునఁ జెల్లు సెట్టు భీష్మా స్త్రనుల కయ్యం బయ్యెరు వాఁగును నొండొకసేపు నిశ్శ్వ అపడి చూచుచుండె నశ్వత్థామ భూరిశ్రవశ్శల్య పుత్రచిత్ర సేనులు మత్తమాతంగంబులు సింగంబు గొదముఁ బొదువు పోలిక నభిమన్యుం బొదివిన నతండు. 178

క. కని యల్లన నవ్వుచు గురు
తనయునియుర మేసి శల్య ♦ తనయుఁ బసిఁడముఁ
దునిమి శ్లాస నీదు తనయుని
ధనువుఁ ద్రుంకి సోమదత్త ♦ తనయుని నొంచెన్. 179

క. వారును ముందటి యాగ్రహరు
నీరసమున నొక్క పెట్ట ♦ యేయఁగఁ బలుదో
స్సారుండగు సౌభద్రుఁడు
ధారస్ఫురణమున నద్భు ♦ తంబుగఁ బోరెన్. 180

ఆ. హస్తలాఘవమున ♦ నతులబలంబున
శౌర్యమహిమ నధిక ♦ ధైర్యమునను
సవ్యసాచి తనయు ♦ సరి గార యమ్మహా
వీరు లంతవట్టుఁ ♦ గౌరవేంద్ర 181

వ. ఇట్లు పెక్కు ద్రచ్చిఁడం బెనంగుపుత్రులఁ గనుగొని యస్త్ర నుండంట నార్చియడరి యందర కన్నిరూపులై నొప్పించి చిక్కు పటిచెనప్పుడు నీకొడుకు పంపునం ద్రిగర్తులుఁ గృత వర్మయుఁ గేకయులును ముప్పదేను వేలరథంబుల వారును గవిసి కిరీటిం గొడుకునుం బొదివిరట్టియెడ. 182

మ. తఱికిం జొచ్చి కడంగి పోరు విజయుం ♦ దాదవ్వులం
జూచియే | డ్తెఱఁ బాంచాలసుతుండు సత్వరగతిం ♦ దే
రద్దెసన్ సారథిం | బఱపం బంచి నిశాత బాణ పటలీ ♦
పాతంబునన్ వైరులు | గ్కఱఁ దాఁకెం దమసైన్యముల్
గలఁగ శౌ ♦ ర్యస్ఫూర్తి శోభిల్లఁగన్. 183

వ. ఇట్లు ధృష్టద్యుమ్నుండు పురందరనందనునకుం దలకడచి
తాఁకి. 184

క. శరములు మూఁటం గృపుఁ బది
శరముల మద్రేశు నొంచి ♦ శర మొక్కట ను
గ్ధరగతి యుగ్రకృతవర్మ్ముని
యరదముఁ దురగముల నొకట ♦ నవనిం గూల్చెన్. 185

వ. అప్పుడు శల్యనందనుండు. 186

క. పదిటన్ ధృష్టద్యుమ్నునిఁ
బదియమ్ముల నతనిసూతుఁ ♦ బటురయమున ను
న్మదుఁడై నొప్పించినఁ గెం
పొదవిన మోమలఁతినవ్వు • నొప్పున నొప్పెన్. 187

క. ఆపృషతపౌత్రుఁ డుద్ధత
కోపానలుఁ డగుచు శల్యు ♦ కొడుకుధనువు నా
టోపమునఁ దునిమి ఫణిరా
జోపమితాస్త్రంబు లతని ♦ యొడలం జొనిపెన్. 188

వ. ఇవ్విధంబున. 189

క. నొ నేసి సూతుహయసం
తానముఁ జంపుటయు శల్య ♦ తనయుఁడు విరథుం

వై నిరుపమాన మగుతన
మానము వాహనము గాఁగ ♦ మద మెలరారన్. 190

—శల్యనందనుఁడు ధృష్టద్యుమ్నునితో యుద్ధముఁ జేసి చచ్చుట.—

క. పలకయు నాలును గొని తె
క్కలు గలపెనుఁబాముపగిదిఁ ♦ గవిసిన గాంతే
యులు సూచి వెఱఁగుపడి రా
బలమును నీబలముఁ బొగడెఁ ♦ బటుశౌర్యంబున్. 191

వ. ఇట్లు గవిసి. 192

క. వెరవున ధృష్టద్యుమ్నుని
శరనికరం బెల్లఁ బలక ♦ జడియుచుఁ గిరణ
స్ఫురణాతిభీషణం బై
కరవాలము మెఱయఁ జిత్ర ♦ గతులఁ గవిసెన్. 193

తే. కవిసి వ్రేసిన గ్రక్కున ♦ గదయు మర్చి
యాఁగి వజ్రప్రహారంబు ♦ ననుకరింప
ద్రుపదనందనుఁ డడిచినఁ ♦ దునియలయ్యెఁ
బలక రెండవ వాటునఁ ♦ బగిలె శిరము. 194

క. తల వ్రయ్యలైనఁ బ్రాణం
బులును గృపాణంబు విడిచి ♦ భువిఁ ద్రెళ్లె నతం
డలు కొంది కురుబలం బా
కులతం బొందఁగఁ గొండ ♦ గూలిన భంగిన్ 195

తే. ఇత్తెఱంగున నిజపుత్త్రుఁ ♦ డీల్గుటయును
గ్రోధ దీప్తుఁ డై శల్యుండు ♦ ద్రుపద సూతి

మీఁదఁ గవిసిన నాతఁడ ♦ మేయు బాణ
పంక్తి వరఁగించె నుజ్జ్వల ♦ ప్రభలు నిగుడ. 196

వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె 197

క. మానుష మేటికి దైవా
ధీనము సర్వంబు నస్మ ♦ దీయస్ఫాయ
త్సేనలఁ బొందును నృపాలక
సూనులు గెల్చెదరు కంటె ♦ సూతతనూజా, 198

క. చావును నోవును మన సౌ
ఖ్యావలికిన్ గెలుపు నుబ్బు ♦ నావలికిని నీ
చే వినియెద మది నెట్టులు
శ్రీనిధవము పాండవులకుఁ ♦ జేపడునకదే. 199

వ. దుర్యోధనుదుర్నయంబున నేనుదుర్వార్తలు వినుచు దుఃఖం
బు లనుభవించు వాఁడ నైతిఁ గౌంతేయుల గెలుచును
పాయుం బెద్దియుం గన్నవారము గామనిన సంజయుండది
యట్టిద నీ సైన్యంబు సేనాంగంబు లనేకంబులు వొలిసె
దొరలు మడిసెదరు దర ధైపీను మని యిట్లనియె
నట్లు శల్యుచేత బహుబాణంబులం బొడువఁబడి పార్షతుం
డతని సపరిమితనిశితశరంబులం బొదువ నతం డతని
విల్లుదునిమి వివిదాస్త్రంబుల వెగడుపఱిచిన నాధృష్టద్యు
మ్నుండు నొచ్చుటయుఁ జూచి సుభద్రానూనుండు మద్ర
పతిం దాఁకె నప్పుడు కురుపతి పురికొల్ప దుర్ముఖుండును
దుస్సహుండును దుర్మర్షణుండును సత్యవ్రతుండును జిత్ర
సేనుండును బురుమిత్రుండును వివింశతియును వికర్ణుండును

నయ్యభిమన్యు మార్కొనుట కలికి పాంచాలనందనుపై నడరి యొక్కొక్కండ పెక్కమ్ము లేసిన నాప్రమత్తప్రతుండు చలింపక యొక్కొక్కరునిం బెక్కమ్ములేసి కరలాఘవంబు నెఱపి యందఱకుం జాలి సమరంబు సేయుచుండె. 200

క. నకులుండు సహదేవుఁడు మా
మకు నచ్చెరువాలుఁ బ్రియము • మదిఁ దలకొన నం
బకవృష్టి గురియ సస్త్ర
ప్రకరంబునఁ బొదివె మద్ర • పతియును వారిన్. 201

వ. వారికి బాసటనై పాంచాలమత్స్యపతులు సైన్యోపేతంబుగా దఱిమిన మన యందు గలదండిమగలు శల్యునకు సాహాయ్యంబు సేసి రంత దినమణి యంబరమధ్యం బలంకరించె నట్టియెడ. 202

తే. భీమసేనుండు నేఁడు సం • గ్రామమునకు
దీక్షుదల యగుఁగా కని • తీవ్రకోప
దీప్తుఁడై గదఁ జూచుచుఁ • దేరు నీదు
తనయునకు సమ్ముఖంబుగఁ • దఱుముటయును. 203

క. నీకొడుకు లందఱును వెఱ
నాకులతం బొందిరప్పు • డగ్రజుఁడు గజా
నీకము మగధు వీరో
ద్రేకంబునఁ బనిచె మారు • తిం దలపడఁగాన్. 204

వ. పనుచుటయు నతం డురవడించిన. 205

చ. గజఘటలం గనుంగొని వి • కాసము మోమునఁ బల్లవింపఁ
గా భుజశిఖరంబునందు గద • ప్రాన్చి మదంబునఁ దేహ
డిగ్గి వాయుజుఁడు గడఁగి భీషణన • ముద్ధతిమైఁ దలపడ్డఁ
బర్వతవ్రజముపయిన్ వెసం గవియు • వాసవుచందము
దోఁచెన త్తఱిన్. 206

క. నిజసింహనాదమున న,
గ్గజములు గుండియలు ఎగిలి • కలకుండువడన్
విజయాగ్రజుఁ డిట్లేచి ది
విజవర్గము పిచ్చలింప • విస్ఫురితగతిన్. 2.7

వ. విక్రమవిహారంబునకుం జొచ్చినప్పుడు గ్రావదేయులు నభి
మన్యుండును గవలును ధృష్టద్యుమ్నుండును గరిసముత్కరం
బుపై శరనికరంబులు నిగిడించుచు భీముని నిరుగెలంకులం
జేరి కవిసి రందు నకులనందనుం డగు శతానీకుండు హస్తి
కుల మస్తకంబులు భల్లంబుల డొల్లనేయుచు నడరె నట్టి
యెడ. 208

చ. మగధమహీశుఁ డేచి యభి • మన్యునిపైఁ గరిఁ గొల్పను
జ్జ్వలంబగు నొకనారసంబు దొడి • యాతఁడుదగ్రత ఫాల
కుంభసంధిగతము గాఁగ నేయ నది • దీనత గ్రుంగఁగ
నప్పు డక్కజంబుగ వెస మాగధుం డనియె • భూస్థలి
నయ్యరుపీనుఁగుం బడన్. 209

క. ధృష్టద్యుమ్నుఁడు నుజ్జ్వల
దష్టాపదపుంఖమార్గ • ణావళి నయ్యు

త్కృష్టగజఘటలఁ గలఁచె
నవష్టంభవిజృంభణంబు ♦ వైరులు వొగడన్. 210

ఉ. కొన్నిటి హస్తముల్ సదియఁ ♦ గొన్నిటిఁ గొమ్ములు దు
మ్మున్నదూళిగాఁ గొన్నిటిఁ గుంభముల్ వగులఁ ♦ గొన్నిటిఁ
గాళులు నుగ్గునూచగాఁ ♦ గొన్నిటిఁ బొన్నవ్వముల్
నలియఁ ♦ గొన్నిటి వీఁపులు పిండుపీఁచుగా నన్నిటి శౌర్యముఁ
డుద్భటగ ♦ దాహతి నేనిక వేఁట లాడఁగన్. 211

క. అభిమన్యుద్రుపదసుత
ప్రభృతులతనితోన మెలఁగి ♦ బడలువడఁగ న
య్యిభచయము నిశితవిశిఖ
క్షుభితముగాఁ జేసి రిపు ♦ సొంపారఁగన్. 212

క. ద్విరదము లొఱగెడివియు నె
త్తురు గ్రక్కుచుఁ గూలెడివి గ ♦ దుప్రులై కలయం
దిరుగుడు వడి గూడెడివియు భువిఁ
బొఱలెడివియు నయ్యెఁ బవన ♦ పుత్రుమ్మగునన్. 213

క. ఏనుఁగుసెత్తుట గదయుం
దానుఁ దడిసి విలయకాల ♦ దండధరుని చం
దానం బొవని మాగధ
సేనం బీనుంగుపెంటఁ ♦ జేసి చెలంగెన్. 214

క. శరములవేగంబున గద
పరుసఁదనంబునను గలఁగఁ ♦ బడి చేష్పడ నా
వరులం దోలెను భీముఁడు,
వెరవున గోపకుఁడు గధుపు ♦ వెలిచినమాడ్కిన్. 215

క. పెనుగాలిఁ దూలు మొగిళులొ
యన నిభములు విఱిగి నిజబ ♦ లావలి పదియుం
దనమీఁదఁ బాఱ దుర్యో
ధనుఁ డదలిచి సర్వసైన్యతతిఁ బురికొల్పెన్. 216

క. పతి పురికొలిపిన నసువస
మతిశయముగఁ బొంగుజలధి ♦ యనఁ గ్రమ్మినయు
ద్ధతబలము నిలిపె నమ్మా
రుతి చెలియలికట్టక్రియ ని ♦ రూఢస్థితిఁ డై. 217

వ. ఇట్లు నిలిపి యార్చి తఱియఁ జొచ్చి వృకోదరునకుం దో
డయి ధృష్టద్యుమ్న సౌభద్రప్రముఖు లగు రథికజనం
బులు. 218

క. విడువక దాపట వలపట
గడిమి మెఱయ నిలిచి యప్పుడు ♦ కౌరవసేనం
గడుఁ జిక్కువఱచి రొక్కు
మ్మడి నమ్ములవానఁ గురిసి ♦ మద మెలరారన్. 219

క. అడవి దరికొనినపావకు
వడువునభీముండు గౌర ♦ వవ్యూహంబుఁ
బొడిసేయుచుఁ బేర్చెం దన
యొడలు మనము నంత కంతం ♦ బుబ్బుచునుండన్. 220

క. ఉరమునఁ గటిమైఁ దొడలం
జరణములం గౌరవేంద్రు ♦ చతురంగబలుల్
ధరఁ జాపకట్టువడ ని
ష్ఠురగతిఁ దాఁకుచు సమీర ♦ సుతుఁడు చరించెన్. 221

తే. తుంగమదమున నాడు మా • తంగవిభుని
భంగి భవదీయ సైన్యంబు • బడలువడఁగ
లీల నిస్సంభ్రముండయి • కేలిసలిపె
గాలి చూలప్పు గగనచ • రాలి వొగడ. 222

క. వెఱచఱచి వెగడువడి ని
న్వ్రాఁకఁ గొందుచుఁ గురుబలంబు • పేరు లతని డ
గ్గఱ కంతనంతఁ జూడఁగ
నుఱక నదీసుతుఁడు దాఁకె • నుద్భటభంగిన్. 223

క. అరదంబు రవము సెలఁగఁగ
శరములు వాయుజునిమీఁద • సాంద్రముగ నెసం
గురియుచు నడరెడు భీష్ముని
సరభసముగ మాఱుకొనియె • సాత్యకిగడిమిన్. 224

వ. ఇట్లెదిర్చినం జూచి. 225

క. అంబరము నగులనార్చి జ
నంబు వొగడఁ గృష్ణునకు • నకు మాఱ్కొని ప్రే
వాంబకములు పదియింట న
లంబుసుఁడు దదంగకంబు • లం గీలించెన్. 226

వ. ఇవ్విధంబునం దాఁకి బెట్టునొప్పించినం గోపించి. 227

చ. శినిమనుమండు నద్దనుజు • శీఘ్రము నాలుగు నారసంబులన్
వెనుక కొదుగఁ జేసి పటు • విక్రమ మొప్పఁగ నార్చి
నార్చినన్ విని కనుఁగ్రేవఁ గెంపడర • వీరరసోద్ధతిఁ జూచి
సోమదత్తుని తనయుండు బిట్టతని • తోఁ దలపడ్డ నుతించె
సైన్యముల్. 228

వ. ఇత్తెఱంగునం దలపడి. 229

క. భూరిశ్రవుండు దొమ్మిది
నారాచము లతని మేన ♦ నాటించిననా
కౌరవ్యునిఁ బటువిశిఖా
సారంబున ముంచినొంచె ♦ శైనేయుండున్. 230

ఉ. ఈసునఁ దానుదమ్ములున ♦ రేంద్రుఁ డుగ్రగదుగసామద త్రికీ
బానటద్రైకడంగెనట ♦ పాండవులుజ్ఞాహారితమ్ముఁ గూడిపె
ల్లేసిరి వారిపై నధప ♦ యేక్షై ఆ మీఁటి బకారి యాపు సం
త్రాసనభాసురుండగుచుఁ ♦ దాఁకి తెరల్చె భవత్కుమా
రులన్. 231

—:సుగోర్యధసుతుడు భీముని మార్కొని మూర్ఛఁ బొందించుట.:—

ఉ. తమ్ములు వీఁగిసం బతయు ♦ దగ్రతి భీము నెదిర్చి యా
ర్చుచుం | దొమ్మదియమ్ములం దనువు ♦ దూఁటులు సేసి
నసూతుఁబిల్చి వే | గమ్మ రథమ్ము పైకరిగి ♦ కన్నులనిప్పు
లురాల నవ్వియొ | కమ్మడి నాతఁడేసె నృపు ♦ నుగ్ర
గతిం బదినారసంబులన్. 232

సీ. అంతఁ బోవక సూతుఁ ♦ డగునందకుని మూఁడు
శరముల నేసిన ♦ ధరణినాథుఁ
డఱువదియెమ్ముల ♦ నతని నాతనిరథ
చోదకుం డైనవి ♦ శోకుమూఁట
నఱిముఱినోనేసి ♦ మఱియు నొక్కమ్మున
ఘనశరాసనము ద్రుంచినఁ బ్రదీప్త

తే. అప్పుడుబ్బి దుర్యోధనుఁ • డతిరయమునఁ
దేరువఱపించి మారుతిఁ ♦ దెగువతోడఁ
గదిసి బలునారసంబు వ • క్షముననాట
నొల్లఁబోవుచు సిడ మత్తిఁ ♦ జూచెఁ గొనియె 242

వ. అయ్యవసరంబున.

—:ఘటోత్కచుండు మాయాబలంబునఁ గౌరవసేనపై విజృంభించుట:—

క. మనసేన పేర్చి పెల్లా
గ్చినఁ జూచి ఘటోత్కచుండు ♦ సెలఁగి జనకుఁ జే
కొని యిది మాయ ఘటింపఁగ
ననురూపంబైనవేళ ♦ యని తలఁచి వెసన్. 244

వ. కైలాసశైలాకారంబును జతుర్దంతిసారోదారంబును నుద్దా
మగమన దుర్వారంబును నగువారణంబు నెక్కి వజ్రజ్వా
లాభీలబాహుదండుండగుచు నయనసహస్రంబు బొప్ప
నాప్పాండవులకుం దోడుపడనై రావణారూఢుండై యిం
ద్రుండు చనుదెంచె ననుబుద్ధి వైరులకుం బుట్టునట్లుగా
నంజనవామనాది దిగ్గజంబు లెక్కట్టివి యని వినంబడు
నాభంగి మత్తేభంబుల నెక్కి తక్కటి దిక్పాలురపోలికం
దోడి దానవులు గెల్వంకుల నేతేరం గురుపతిపైఁ దోఁతెం
చి యతనికడ్డపడు భగదత్తు దంతిం బొదివి.

క. అమ్మల నేనుఁగుకొమ్ముల
నమ్మత్తగజమ్ము నొంచి ♦ యఱిముఱి మనసై
న్యమ్మెల్లఁ జదియ బఱచె భ
యమ్మున మొగతిరిగి దిక్కు • లద్రువ నొరలుచుఁ . 246

వ. ఇట్లాభీలంబుగా భగదత్తుశుండాలంబుఁ దోలి యురవ
డించి. 247

క. దనుజపతి యేచి దుర్యో
ధనుపైనఁ గడరుటయుఁ దత్తి ♦ తానుపహుఁ డాచా
ర్యు నిట్లను హైడింబుఁడు
వనమాతంగాగర్వమున ను ♦ దగ్రుం డయ్యెన్. 248

క. భగదత్తు నెగచి కౌరవ
జగతీశ్వరుమీఁదఁ గవిసె ♦ సరభసవృత్తిం
దగ నష్టపదక తెడయుట
మగటిమియే పొదువ వలయు ♦ మనుజాశనునిన్. 249

చ. కలఁగెపనాఁడు గాఁడు భగ ♦ దత్తుఁడు భీమతనూజుతోడ
సి | ట్టులముగఁ బోరఁ జాలు నక ♦ టా కరి యోరువ దే
మి సేయు ని | చ్చలవిడి భూవిభుం గవిసె ♦ సామజముం
గెన నేయుఁ డంచు జో | దులకును జేయివీచియును ♦ ద్రో
ణునతఁ డారథంబు బల్విడిన్. 250

వ. ఆచార్యప్రభృతులగు రథికవరులునుం గూడికొని కురుభూ
పతి కడ్డపడి హిడింబానందనుపైఁ గ్రందుకొని వివిధాస్త్రం
బులు వరఁగించిరంత నక్కడ నతనికిఁ దోడై యుధిష్ఠి
రాది పాండవులును బాంచాలమాత్స్యప్రముఖ దండనా
యకులును బ్రతివీరులపై ననేకవిశిఖంబులు గురియ
నప్పుడు పోరు ఘోరంబయ్యె నంత నుద్దాకినీనందనుం
డమందపరాక్రమక్రీడం గాంగేయబలంబులం గనుపు
గొల్పె నట్టియెడ నాఘటోత్కచుం డుత్కటోద్దామవిక్ర

కోపుఁడై యొండొక ♦ చాపంబుగైకొని
యుగ్రభల్లమున వృ ♦ కోదరుండు
ఆ. విల్లు దునుముటయును ♦ వేఁడొక్క వింట వ
జ్రంబుఁబోని నార ♦ సంబు దొడగి
రాజరాజు వెస ను ♦ రం బాడ నేసిన
మూర్ఛవచ్చి యతఁడు ♦ మ్రొగ్గె నధిప.
క. కని కడు నలిగి సుభద్రా
తనయుఁడుఁ బాంచాలరాజ ♦ తనయుఁడుఁ కృష్ణా
తనయులు నొక్కుమ్మడి నీ
తనయునిఁ బొదివిరి పటు ప్ర ♦ దరపుంజములన్. 234
ఉ. అంతకు నేద దేఁటి విల ♦ యాంతకునాకృతిభీముఁడేచి దు
ర్దాంతపరాక్రమస్ఫురణఁ ♦ దాఁకి నరేంద్రతనూజుశల్యున
త్యంతరయంబునం బటుశ ♦ రావలి నొంచిననీదుసైనికుల్
సెంతలఁ జేరరైరిబలు ♦ సింగముఁ గన్నగజంబులట్లయై. 235
వ. అప్పుడపరాహ్ణం బయ్యెఁ దత్సమయంబున భవత్సూనులు సేనాపతి సుషేణజలసంధ సులోచనులును భీమభీమరథ భీమబాహుదుష్ప్రధర్షదుర్ముఖులును వివిత్సువికటోగ్రా లోలుపసములు నీపదునలువురు బాహుశరంబు లడరిం చుచు నతనిం బొదివిన నజ్జరాసంధ మర్దనుండు ఘన శార్దూలంబు బాలమృగంబులం గని కవియు చందంబున నెదుర్కొని సేనాపతిశిరంబు భల్లంబునంద్రుం చి బాణత్రయంబున జలసంధు నంతకాలయంబున కనిచి సుషేణువక్షస్స్థలంబున వలుఁదనారసంబు నాటించి పడ

వైచి భీముబాహుల నస్త్రప్రపంచకంబునం జంపి నుగ్రుసుత్త
మాంగంబు వెడఁదవాతియమ్మునం గుండలంబులతోఁ
గూల్చి భీమభీమరథుల నొక్కొక్కమ్మునం బెక్కమ్ములం
గూలనేసి నగుచు మిక్కుటమ్మగు నాలుగమ్ముల సులోచ
నుం గీటడంగించిన. 236

క. పెఱవార లధికభీతిఁ
విఱిగి చనిరి భీష్ముఁ డేచి ♦ వీరరథకు లం
దఱుఁ జూచి రాచకొడుకుల
నఱుమాడెడు భీముఁ డిట్లు ♦ నడుకందగునే. 237

వ. అని పురికొల్పికొని తొడరునట్టియెడ. 238

క. మిగిలి పవమానసుతుపై
భగదత్తుఁడు మత్తగజముఁ ♦ బఱపి యతని నా
శుగములఁ బొదివిన నమ్మెయి
మొగిళులు రవిఁ బొదువుపగ్ప • ముందలఁపించెన్. 239

చ. కని యభిమన్యు ముఖ్యు లవి ♦ కంపితవృత్తిఁ గడంగి యే
సినం । దనువున నెల్ల రక్తజల ♦ ధారలు గ్రమ్మఁగ వార
ణేంద్రుఁ డే । పున సెలయేఱు లొక్కమొగి ♦ జొరనఁ
బెక్కడరంగ లీలఁగ్రా । కొని ఘనశైలి సల్పునడ ♦ గొం
డగతిన్ సముదగ్రమూర్తియై. 240

క. కవిసి బలముఁ జంపఁగఁ బాం
డవ యోధులు నిల్వరించు ♦ టకుఁ జాలక చె
చ్చవడినఁ గని పెల్లుగఁ గౌ
రవసైన్యము లడరె నుద్ధు ♦ రస్ఫురణ మెయిన్. 241

తే. అప్పుడుబ్బి దుర్యోధనుఁ • డతిరయమునఁ
దేరువఱపించి మారుతిఁ • దెగువతోడఁ
గదిసి బలునారసంబు వ • క్షమున నాట
సొల్లఁబోవుచు సిడ మంటెఁ • నూఁత గొనియె 242

వ. అయ్యవసరంబున.

—ఘటోత్కచుండు మాయాబలంబునఁ గౌరవసేనపై విజృంభించుట:—

క. మనసేన పేర్చి పెల్లా
ర్చినఁ జూచి ఘటోత్కచుండు • సెలఁగి జనకుఁ జే
కొని యిది మాయ ఘటింపఁగ
ననురూపంబైనవేళ • యని తలఁచి వెసన్. 244

వ. కైలాసశైలాకారంబును జతుర్దంతిసారోదారంబును నుద్దామగమన దుర్వారంబును నగువారణంబు నెక్కి వజ్రజ్వాలాభీలబాహుదండుండగుచు నయనసహస్రంబు బొప్ప నాప్పాండవులకుం దోడుపడ నైరావణారూఢుండై యింద్రుండు చనుదెంచె ననుబుద్ధి వైరులకుం బుట్టునట్టుగా నంజనవామనాది దిగ్గజంబు లెట్టెట్టివి యని వినంబడు నాభంగి మత్తేభంబుల నెక్కి తక్కటి దిక్పాలుర పోలికం దోడి దానవులుం గెలంకుల నేతేరం గురుపతిపైఁ దోఁతెంచి యతనికడ్డపడు భగదత్తు దంతిం బొదివి.

క. అమ్మల నేనుఁగుకొమ్ముల
నమ్మత్తగజమ్ము నొంచి • యఱిముఱి మనసై
న్యమ్మొల్లఁ జదియ బఱచె భ
యమ్మున మొగతిరిగి దిక్కు • లద్రువ నొరలుచున్. 246

వ. ఇట్లాభీలంబుగా భగదత్తుఁడు శుండాలంబుఁ దోలి యురవ
ణించి. 247

క. దనుజపతి యేచి దుర్యో
ధను వెస కడరుటయుఁ దప్పి • తా నపుఁ డాచా
ర్యున కిట్లను హైడింబుఁడు
దనమానగర్వమున ను • దగ్రుం డయ్యెన్. 248

క. భగదత్తు నెగచి కౌరవ
జగతీశ్వరుమీఁదఁ గవిసె • సరభసవృత్తిం
దగ నడ్డపడక తడయుట
మగటిమియే పొదువ వలయు • మనుజాశనునిన్. 249

చ. గెలఁకెసఁగాఁడు గాఁడు భగ • దత్తుఁడు భీమతనూజుతోడ
ప | త్రాలముగఁ బోరఁ జాలు నక • టా కరి యొరువ దే
మి సేయు ని | చ్చలవిడి భూవిభుఁ గవిసె • సామజముక్
వెస నేయుఁ డంచు జో | దులకును జేఁ జుపిచిమును • ద్రో
ణసుతుం డురథంబు బల్విడిన్. 250

వ. ఆచార్యప్రభృతులగు రథికవరులునుం గూడికొని కురుభూ
పతి కడ్డపడి హిడింబానందనుపైఁ గ్రందుకొని వివిధాస్త్రం
బులు వఱఁగించిరంత నక్కడ నతనికిఁ దోడై యుధిష్ఠి
రాది పాండవులును బాంచాలమాత్స్యప్రముఖ దండనా
యకులును బ్రతివీరులపై ననేకవిశిఖంబులు గురియ
నప్పుడు పోరు ఘోరంబయ్యె నంత నమ్మందాకినీనందనుం
డమందపరాక్రమక్రీడం గౌంతేయబలంబులం గనుపు
గొట్టె నట్టియెడ నాఘటోత్కచుం డుత్కటోద్దామవిక్ర

మాభిరాముం డగుచు సింహనాదంబు సేయ బృంహితో
దాత్తంబులైన తదీయ దంతాఘోషంబులు నలిరేఁగి సైన్యం
బుల బడలువడం జేసినం గని గాంగేయుండు గుంభసంభ
వున కిట్లనియె. 251

క. ఈయనతో రణమిప్పుడు
సేయఁగ మదిఁగొల్ప దస్త్ర ♦ శిఖికిం జేరం
దోయజమిత్త్రుఁడు సేఁటికిఁ
బోయి మానము వత్తమెల్లి ♦ ప్రొద్దున ననికిన్. 252

ఆ. అనిన నట్లకాక ♦ యని ధనురాచార్యుఁ
డప్పు డాత్మపక్ష ♦ మైనరథిక
కోటి కెఱుఁగఁ జెప్పి ♦ కొని యని సేయుట
నిలిపి తివియఁ బంచె ♦ బలము నెల్ల. 253

వ. ఇవ్విధంబున. 254

క. కౌరవబలములు దిరిగిన
భేరీశంఖాదితూర్య ♦ భీషణరావో
దారపటుసింహనాద
స్ఫారవిలాసంబులయ్యెఁ ♦ బాండవబలముల్. 255

తే. చిన్నఁబోయి నీకొడుకులు ♦ సేయఁగలుగు
దొరలు విడిదల కరిగిరి ♦ పరఁగ భీమ
సేనుకొడుకు నగ్గించుచుఁ ♦ జెలఁగి వారు
చెన్నుసొంపారఁ జనిరాత్మ ♦ శిబిరములకు. 256

వ. అని యిట్లు నాలవనాఁడు ధార్తరాష్ట్రులు దూలపోవుట
సెప్పిన విని సంజయునకు నాంబికేయుం డిట్లనియె. 257

చ. అనితల నీవు పాండుతన♦యావలి కెవ్వఁడు మేలుచేయునా
తనయులకుం బరాక్రమము ♦ దక్కువయుం బ్రకటింప
విందు భీష్ముని గురు శల్యుఁ దక్కఁ గల ♦ శూరుల నెల్ల
ను వారు నీరికింఁ గొన కిటు లింతవా రగుట ♦ కుం గతమె
య్యది నాకుఁ జెప్పుమా. 258

క. అనుటయు నాతం డిట్లను
విను మౌషధగుణము మంత్ర ♦ వీర్యము మాయా
జనితసమగ్రోద్ధతి గా
దనఘా నీకేను మున్న ♦ యది యెఱిఁగింతున్. 259

ఉ. పాడియు సత్యముం గలరు♦పాండుతనూజులు నీదుపుత్రుల
ప్పాడికి నోడర త్తెఱఁగు ♦ పాపము సేయఁగఁ జూచితీవు న
క్కీడిటుసేయ కేలుడుగు ♦ గెల్వరె ధర్మువు వారిగెల్పు
మీ రోడుటయుం ధ్రువంబు విదు ♦ రోక్తులు విఁటిమి
గాదె యేర్పడన్. 260

క. నీయడిగినభంగిన గాం
గేయు నశిగె నట్లు వారు ♦ గెలిచి చనినయా
రేయి కురునాథుఁ డాతని
కాయన సెప్పినవిధంబు ♦ నభివర్ణింతున్. 261

వ. భీష్ముండు దుర్యోధనున కిట్లనియెఁ దొల్లియుం బలుమాఱుం
జెప్పుదుఁ బాండవులకు వాసుదేవుండు సహాయుండై యుం
డునట్లగుట నెయ్యదియు నసాధ్యంబు లే దప్పరమేశ్వరు
మహాత్త్వం బున్నరూపెఱిఁగెదు నారు పెక్కండ్రు లే రె
ఱిఁగినవారల కాపదలు లేవు కౌంతేయు లతని నెఱింగి

యాశ్రయింతురు నీవు సరకుసేయవు వినుముచెప్పెద
మానససరస్సునుత్తరపర్వతంబు నగ్రప్రదేశంబున దేవతా
మునిగంధర్వాప్సరోగణంబులు గొలువుం గొలువుండి
కమలసంభవుండు. 262

తే. మణిగణోజ్జ్వలమైన వి ♦ మానమొకటి
యంబరంబునఁ గాంచి స ♦ ర్వాత్ముఁడందు
సన్నిహితుఁ డగుటెఱిఁగి హ ♦ ర్షంబు సంభ్ర
మంబుఁ దలకొన లేచి న ♦ మస్కరించి. 263

క. లోకోత్పత్తిస్థితివిల
యాకలనవినోద మునిగ ♦ ణార్చిత గుణర
త్నాకల్ప నిర్గుణాత్మక
శోకభయాపహపదాబ్జ ♦ శుభకరమూర్తీ. 264

వ. అని మఱియు ననేక ప్రకారంబుల సంస్తుతించి యిట్లని
విన్నవించె. 265

క. నారాయణ నీకేఁగడు
గారవమునఁ బుట్టి యిజ్జ ♦ గము లన్నింటికిన్
సారమతిం గావించితి
నీరక్షణ వీనికెల్ల ♦ నిలుపై యుండున్. 266

క. ఇత్తఱి మనుష్యభువనం
బుత్తలపడు చున్నయది మ ♦ హోగ్రాసురదు
ర్వృత్తములు నీవు కరుణా
యత్తమతిం బుట్టవయ్య ♦ యదువంశమునన్. 267

క. నరసఖుఁడ నీవు సఖుఁడును
నరలోకమునన్ జనించి ♦ నానాదైత్యే
శ్వరులదెసఁ బీడ లుడుపుము
ధరణీభారంబువాయఁ ♦ దాత్పర్యమునన్. 268

వ. అని వేఁడికొని వినతుండయి యద్దేవునితోడినీడయుం బోని నరనామధేయుండగుమహాపురుషుం బ్రార్థించిన నన్నారాయణుండునుం గారుణ్యార్ద్రకటాక్షంబున వీక్షించి యట్లయయ్యెడుం గాక యని యానతిచ్చి యంతర్ధానంబు సేసిన నక్కొలువు వారెల్ల నచ్చెరువంది. 269

క. పరమేష్ఠి నీవు గడుఁ ద
త్పరతను వినయంబు సేసి ♦ ప్రార్థించితి వె
వ్వారొకో వీరలు నావుడు
సరసిరుహాసనుఁడు సెప్పె ♦ సంప్రీతిమెయిన్. 270

క. పరమమును లాదిపురుషులు
నరనారాయణులు వీరు ♦ నాకారాధ్యుల్
నరహితముగఁ బ్రార్థించితి
ధరఁ బుట్టుం డనుచు దానిఁ దలకొనిరి దయన్. 271

క. ఇలఁ గ్రీడగఁ బుట్టినవీ
రలఁ గేవలమర్త్యులని స ♦ రకు సేయనివా
రలు సెడుదు రెఱిఁగి భక్తిం
గొలిచినవారలకు శుభమ ♦ గుచు వినుఁ డెందున్. 272

వ. అని యెఱింగించి బ్రహ్మ దనలోకంబున కరిగెఁ గొలువు వారలు నిజస్థానంబులకుం జని రిక్కడ నీకథ నారదజాము

దగ్నుల్ వ్యాసాదులచేత వింటిం దొల్లియు మహామునులు నిన్ను నరనారాయణులతోడి వైరంబు వలవ దని వారిం చిరి కాదే నీవు మదాంధుండవై మానవై తివింకనైనను గృష్ణు నాశ్రయించి పాండవులతోడి పొత్తున మెలంగి బ్రదుకుమనిచెప్పి భీష్ముండూరకుండె గౌరవపతియునప్పలు కులు పెడచెవులం బెట్టె మీరు దగువారు సేయుహితోప దేశంబు లాదరించెదరె యని పలికి సంజయుం డమ్మహీ పతి కిట్లనియె. 273

—భీష్మునిపంచమ దివసయుద్ధక్రమము.—

క. వేగినఁ గౌరవసేనలు
వేగమ కై సేసి యనికి ♦ వెడలెం దీవ్రో
ద్యోగత భీష్ముని ముస్నిడి
సాగరములు మేర దప్పి ♦ చందం బొందన్. 274

వ. ఇట్లు వెడలి మకరవ్యూహం బమర్చుకొని నిలిచె నంతఁ బాండవులును శ్యేన వ్యూహంబుగా మోహరించి రందు ముఖంబున భీమసేనుండును నయనంబుల ధృష్టద్యుమ్న శిఖండులును శిరంబునసాత్యకియును గంఠంబునం గిరీటియు వామ పక్షంబున విరాట్ద్రుపదులును దక్షిణపక్షంబునఁ గేకయులును పిఱుఁద నభిమన్యు ద్రౌపదేయులును బుచ్ఛం బున నకులసహదేవహితుం డయి యుధిష్ఠిరుండును నిలిచి రివ్విధంబున సన్నద్ధంబు లయినయుభయ వ్యూహంబులు మేదురతూర్య నినాదంబులు రోదసీకుహరంబు నిండ నొం డొంటిం గదిసిన. 275

క. మకరవ్యూహం బనియెడు
మకరాలయ మవుడు దర్ప ♦ మహామహోజ్జ్వలుఁ డై
మకరక్రీడం జండత
మకరాభీలముగఁ జొచ్చె ♦ మారుతి యధిపా. 276

ఉ. చొచ్చి పితామహుం గనియె ♦ శుభ్రప్రచయంబునఁ గప్పె
నాతఁడుం | జిచ్చున నేయి వోసినవి ♦ శేషము దోఁపఁగ
భీము నొంచి ము | చ్చిచ్చును నేర్చునట్టులుగఁ ♦ జేసెఁ
దదూర్జితసేన నంత వి | వ్వచ్చుఁడు వచ్చి దివ్యశర ♦ వర్గ
నిరర్గళవిక్రమంబునన్. 277

క. భీష్మునిగర్వం బుడిపి మ
హాహామ్మలుఁ డై కౌరవేంద్రు ♦ యోధుల కెల్లన్
గ్రీష్మాదిత్యునిక్రియ న
ర్చిష్మత్త్వము సూపి యడరె ♦ సేనలు దెరలన్. 278

వ. అట్టియెడ నీకొడుకు గురునిం గదిసి యతని కిట్లనియె. 279

తే. పట్టి పాలార్చెదరు మీరు పాండుసుతుల
నీవు భీష్ముండు నలిగిన ♦ దేవతలకు
నైన మార్కొన వచ్చునే ♦ సేన నరుఁడు
నొంపఁగా నిట్టు లోర్పరి ♦ కింపఁదగునె. 280

వ. అనిన విని కుంభసంభవుండు కటకటంబడి యతనితో
నిట్లనియె 281

తే. ఎన్నఁడును మన్న వారల ♦ యేపు నోపఁ
గాన మెట్లు సముద్రంబు ♦ లోన బుజ్జ

వైవఁ గొన్నంత గొనుఁ గాక ♦ వారిగెల్వ
మాకు శక్యంబె చవిగాని ♦ మాట లేల. 282

క. అనుచు మొన గడచి నడచినఁ
గని పాండుతనూజసైని ♦ కవ్రాతంబుల్
గనుకని విచ్చిన సాత్యకి
యనిలజవం బెసఁగఁ దాఁకె ♦ నస్త్రాచార్యున్. 283

ద్రోణుఁడు దుర్యోధన ప్రేరితుండై పాండవసైన్యంబుపైఁ గవియుట.

సీ. తాఁకి యుజ్జ్వలబాణ ♦ తతి గవియించిన
నవ్వుచు బెడిదంపు ♦ నారసములు
గురుఁడు దై నేయుపైఁ గురిసిన నొచ్చియుఁ
దెరలక యాతండు ♦ తీవ్రభంగి
బెనఁగంగఁ జూచి పా ♦ వని యేచి గురునిపై
నిశితాస్త్రసంతతి ♦ నించి నొంచె
నంత శల్యుండును ♦ శాంతనవుండును
నతనికిఁ దోడ్పడి ♦ యడరి భీము

ఆ. నేయఁ దోడుకుటయును ♦ నేడ్తెఱ ద్రౌపదే
యులును దానుఁ గవిసి ♦ యుగ్రలీలఁ
బటురయంబుమై ను ♦ భద్రాసుతుండు ను
ద్వారవిశిఖతతుల ♦ వారిఁ బొదివె. 284

చ. కడువడితోడ నప్పుడు శి ♦ ఖండి ధనుర్గుణ నిస్వనంబు పె
ల్లడరఁగ బాణజాలము వి ♦ యత్తటిఁ గప్పఁగ నీదుసైన్య
ముల్ । సుడివడ భీష్ముఁ దాఁకుటయు ♦ జూచి మనంబున

నాటవానితోఁ బోడుతునె యంచు మాఱ్కొనక ♦ పోయెఁ
దొలఁగి యత్తెంటు భూవరా. 285

క. కనుఁగొని కురుపతి యాచా
ర్యునిఁ బురికొలుపుట యు నాతఁ ♦ డుద్దామగతిం
జని కడిమి మెఱయు నుజ్జ్వల
ఘనమార్గణపుంజముల శి ♦ ఖండిఁ దెరల్చెన్. 286

క. అమ్మెయిఁ గౌరవులును ద
ర్పమ్ములరఁగఁ జెలఁగుటయును ♦ బాండవబలముల్
సమ్ముఖమునఁ దలపడినను
సమ్మర్దం బుగ్రమయ్యె ♦ సంగ్రామమునన్. 287

క. ఘూళులు వేఘుంబులుఁ గర
వాలాదినిశాతహేతి, వ్రాతాంశుపంటి
న్మాలయు గుణరవగర్జలు
గీలాలపువృష్టికిం బ్ర. గియె నట్టియెడన్. 288

క. ప్రోవులు గట్టెఁ గుఱ్ఱపుఁ
బ్రేవులు సేఁగులకెఱచుఁ ♦ బీనుంగులు ర
క్తావిలత వెల్లచీరలు
గావులునై భటని కాయ ♦ కాయంబులునై. 289

క. సమరాంగణంబు గడుఘో
రముగా నిరువాగుఁ బోరు ♦ రభసంబున ది
క్కమితి వడఁకాడెఁ బొగడెడు
నమరులయులి వడరెఁ జదల ♦ నతినిబిడముగాన్. 290

క. అనిలజనభీష్ములు దమతమ
మొనలకుఁ గన్నాకులగుచు ♦ మునుకొని వడి న
ర్జునకుంభసంభవుల ప్రా
పునఁ జూపిరి విక్రమంబు ♦ పరిబలంబునన్. 291

క. భీముని డెసఁ గాకింగో
ద్రామగజానీకసంగ ♦ తత్వాస్ఫురణా
శ్రీమగతిం దఱిమెం గుగ
భూమీశుఁడు భీష్మగురులు ♦ పోరెడుబలిమిన్. 292

చ. అఱిమి ఱి నీకుమారఁ వరు ♦ లత్తఱి నందఱు నాబకాదిపై
న ఱుక రథంబులం బఱప ♦ నుజ్జ్వలకైలము మేఘుఁ దబ్ర
ముల్ । గఱికొనఁ గప్పినట్లయినఁ ♦ గిరీటి గుణస్వనముల్ల
సిల్ల నే । త్తెఱ విశిఖప్రతాన మను ♦ తీవ్రసమీరము నేపు
సూపినన్.

క. ఆరథనివహంబులు న
వ్వారణములుఁ దెరలి మరలి ♦ వడిఁ బఱచుటయుం
గౌరవబల మెల్లను రణ
శూరుఁడు గాంగేయుమఱువు ♦ సొచ్చె వికలమై. 294

వ. ఇట్లు సేన మొగతిరిగినం గని సుయోధనుండు పరవసంబు
నం బురికొల్పి చేయి వీచుచు నగ్గలిక నడచినం గాంభోజ
గోపాలసింధుగాంధారసౌవీరత్రిగర్తకళింగప్రముఖ బల
సంగతులై శకునిసైంధవులు దుశ్శాసనుం బురస్కరించు
కొని యురవడించి భీమపార్థులం బొదివిన ధర్మనందనుండు
వెన్నుదన్ని యదల్చినం జేదికాశికరూశ పాంచాలసైన్యం

బులతో ధృష్టద్యుమ్న పురోగము లగురథికముఖ్యులు గడంగి కవిసి రప్పుడు విందానువిందులు గాశిరాజును సైంధవుం డు భీమసేనుని వికర్ణుండు సహదేవునిఁ జిత్రసేనుండు శిఖండిని దుర్యోధనుండు విరటునిఁ ద్రిగర్తులు నకులుని ద్రోణుండు చేకితానసాత్యకులను గృపహార్దిక్యులు ధృష్టద్యుమ్నుని సౌభద్రుండు సాల్వకేకయులను ధృష్టకేతుఁడు ఘటోత్కచులు నీకొండుకులం దలపడిరి యుధిష్ఠిరుండు దాను మద్రేశ్వరుం దాఁకె నిట్లు సంకులసమరం బైన సత్రుశస్త్ర సంఘట్టనంబున వెడలుమంటలు మింట నడరినుధ్యాహ్న ప్రచండంబులై యున్న చండకిరణుకిరణంబుల మిగిడింప నరదంబులు దాఁకి పడి పొరలుకరులును గరిహస్తాకర్షణ విధ్వస్తం బు లగురథంబులును దురగఖురపుటవిఘటిత గాత్రులగు పదాతులును బదాతివర్గానర్గళప్రహారధారారక్తసిక్తంబు లగుఘోటకంబులు నై చూచుఖేచరులకు వెక్కసం బయ్యె నట్టియెడ. 295

భీముని పోటుగడు ను
ద్దామంబై మెఱయుటయుఁ బి ♦ తామహుఁడు శర
స్తోమవిదారితుఁ జేసె మ
హామర్షోత్కర్షుఁ డగుచు ♦ నతనిం బెలుచన్. 296

కన్గొని సాత్యకి యేనుం
గునకు సిడులు సూపినట్లు ♦ కోపంబున భీ
ష్మునిమీఁదఁ గవిసి యుజ్జ్వల
సునిశితభల్లంబు లేసె ♦ సురలు నుతింపన్. 297

ఆ. అలిగి యతఁడు సూతు ♦ తలఁ దెగ నేసిన
నధిప వృష్ణివీరు ♦ నరద మిట్టు
నట్టుఁ దిగిచె నప్పు ♦ డాకులగతి ఘోట
కములు దద్బలంబు ♦ గలఁగఁబడఁగ. 298

క. మరలుపుఁడు పట్టుఁ డిటఁ దెం
పరదమునకు వేగవేగ ♦ యడ్డము సనుఁ డా
తురుఁ డయ్యెను సాత్యకి సె
చ్చరఁ జొరుఁ డనుచులివు వారి ♦ సేనఁ జెలంగెన్. 299

తే. వికలరథుఁ డగునావృష్టి ♦ వీరుమీఁద
నేయ నొల్లక మీతండ్రి ♦ యెసక మెసఁగ
బాహుబలమునఁ బాండవ ♦ వ్యూహవిదళ
నంబు సేయఁదొడఁగె భూ ♦ నాథముఖ్య. 300

క. అంత విరాటుఁడు లయకా
లాంతకుఁడుంబోలెఁ బేర్చి ♦ యతిరభసమునన్
శాంతనవుఁ గదిసి యేసెం
గుంతీసుతు లలర మూఁడు ♦ క్రూరాస్త్రములన్. 301

క. ఏసి తురంగంబుల నో
నేసినఁ గోపించి భీష్ముఁ ♦ డిషుదశకమునం
జేసె నతని రక్తజలో
ద్భాసితగాత్రుఁడుగ రెండు ♦ బలములుఁ బొగడన్. 302

వ. అట్టియెడ. 303

శా. గంగానందనుఁ దాఁకి నర్జునుఁడు వోఁ ♦ గా నడ్డమై
రాజు మెచ్చం గేలీగతి యుల్లసిల్లఁ జని య ♦ శ్వత్థామ

క. చండదిరోధతిమిరమా
ర్తాండు లనఁగఁ దగినవీరు ♦ దమలో ని ట్లు
ద్దండతఁ బెనఁగుట ధృతరా
ష్ట్రుం డవినయులోభముప్ప ♦ రుం డగుటఁ జుమీ. 311

వ. అని రట్టియెడ. 312

క. కురుపతికిఁ జిత్రసేనుఁడుఁ
బురుమిత్త్రుఁడు వేల్పుపేటి ♦ పుత్త్రుఁడుఁ బ్రాపై
యురవడిఁ దఱిమిన వారికి
నరనందనుఁ డెదురుపడెఁ గు ♦ ణధ్వని సెలఁగన్. 313

క. పురుమిత్త్రుని నే పుజ్జ్వల
శరముల గంగాతనూజు ♦ సప్తతిబాణ
స్ఫురణమునఁ జిత్రసేనునిఁ
బరమాంబకదశకమున వి ♦ పాటితుఁ జేసెన్. 314

తే. ఎన్నిశరముల నభిమన్యుఁ ♦ డేసెఁ దమ్ముఁ
దారు నన్నియు శరములఁ ♦ దఱిమి చిత్ర
సేనపురుమిత్త్రు లతని నే ♦ సిరి నవోగ్ర
విశిఖములు నాఁటె భీష్ముఁ డ ♦ వ్వీరుమేన. 315

ఉ. ఆతఁడు చిత్రసేనుని శ ♦ రాసన మేట్టెఱఁ ద్రుంచి ఘోటక
వ్రాతము నొంచి సైమజుప్ర ♦ వచ్చి శరంబులు మేన
గ్రుచ్చి యుద్యోతితుఁ డైనఁ జూచి కర ♦ ముద్ధతి రాజత
నూజమార్గముల్ వే తఱియంగఁ జొచ్చి పొది ♦ వెంబలు
మార్గణవృష్టి నాతనిన్. 316

క. ఆసౌభద్రుం డుగ్రపు
వేసవి దావాగ్ని శుష్క ♦ విపినమ్ము నిరా
యాసంబుగ దరికొనుగతి
భాసితశరశిఖలు వారి ♦ పైఁ బరఁగించెన్. 317

క. రంగత్ప్రిథనస్తుత్యతు
రంగముఁడై తాండవాభి ♦ రతుఁ డగుహారులీ
లం గడఁగి వీరనృత్యము
సంగరరంగమునఁ జేసె ♦ శత్రులు మెచ్చన్. 318

వ. ఇట్లు పేర్చి కురుబలంబు నేర్చునభిమన్యుం జూచి జనితమ
న్యుఁడై శుభలక్షణుండగు లక్ష్మణుండు. 319

— అభిమన్యు లక్ష్మణకుమారుల యుద్ధము —

క. తలపడి నానాస్త్రము ల
గ్గలికం గురియుటయు నతఁడు ♦ కాండము లాఱి
ట్టులమైనయలుక నాతని
లలితోరస్థ్సలమునం గ ♦ లయ నాటించెన్. 320

చ. తెరలక లక్ష్మణుండు దృఢ ♦ దీప్తశరావలి పార్థపట్టిపైఁ
దొరఁగఁగఁ జేసినం గినిసి ♦ తొల్త హయంబులఁ జంపి
సారథిఁ । ధరఁ బడ నాతఁ డేసె విర ♦ థత్వము నొం
దియు నీసుమన్నుఁ డుద్ధురగతి శక్తి వైవ నది ♦ ద్రుంచె
మహేంద్రునిమన్నుఁ డమ్ములన్. 321

ఆ. శక్తిఁ ద్రుంచి తీవ్ర ♦ సాయకహతదేహుఁ
జేయఁ వొడగుసతని ♦ చేతిబలుపు

సూచి కృపుఁడు రాజ ♦ సుతుఁ దన తేరిపై
నిడి తొలఁగఁ దెచ్చె ♦ నెల్లఁ జూడ. 322
కురురాజు యోధవీరులఁ
క. బురికొలుపుచు భీష్ముఁ డపుడు ♦ పోరికి నడగం
గరిహయనరశరనిబిడత
ధరణి జలదనిబిడగగన ♦ తలముం బోలెన్. 323
ఉ. సాత్యకి యప్పు డేచి శర ♦ జాలము చిత్రఘుస్ఫుటత్వసాం
గత్యవిరాజమానముగఁ ♦ గౌరవసేనఁ గలంగఁ జేసి యా
ధ్ధత్యమునం దనర్చిన సు♦దాత్తమనస్కుఁడు సోమదత్తియా
హుత్యభిరామవహ్నిక్రియ ♦ నుజ్జ్వలుఁ డై వెసఁ దాఁకె
నాతనిన్. 324
చ. తలపడి యంత్యకాలశిఖి ♦ దారుణభంగి నమేయమార్గణా
ర్చులు వరఁగించుచుం భయము ♦ సొచ్చి జనార్దనుతమ్ము
తోడియో । ధులు పిఱుసన్నఁ దత్సుతులు ♦ దోర్బలదు
ర్దము లై పదుండ్రు న । గ్గలిక నెదిర్చి యిట్లనిరి ♦ కౌరవ
సత్తముతోఁ నుదగ్రతన్. 325
క. భూరిశ్రవసుఁడ యొక్కటి
వీరవినోదంబు నలుపు ♦ వేడుక మెయిఁ దు
ర్వారత వచ్చితి మొక్కరుఁ
గోరికొనుము సంగరమున ♦ కున్ మాలోనన్. 226
చ. అన విని నవ్వి యొక్కఁడు మ ♦ దస్త్రబలంబున కోర్వ
డోపినఁ । సునిశితబాణముల్ వఱపి ♦ సూరెల నందఱు
నొక్కపెట్ట యే । పు నెఱపుఁ డన్న నారథిక ♦ పుంగవు

లేయు నతండు నమ్మ్మ లె | ల్లను దునుమాడి శా రిఁ జటు♦
లస్ఫురితాంబకవృష్టి ముంచినన్. 327

క. పొలివోని శౌర్యరేఖం
జెలఁగుచు వార్ష్ణేయు లతనిఁ ♦ జేడ్పడఁ బెక్క
మ్ముల నొవ్వ నేసినం గడు,
నలిగి శరాసనము లెల్ల ♦ నాతడు దు్రించెన్. 328

క. కోదండదశకశీఘ్రు
చ్ఛేదం బొనరించి యపుడ ♦ శిరములు పదియున్
భూదేవికి బలిగా ని
ష్పాదించెం గౌరవేంద్రు ♦ బలములు సెలఁగన్. 329

వ. ఇట్లు నడినకౌముకులం గని వృష్టివీరుండు. 330

చ. వగవును గోపముం గదుర♦వైరిబలంబు దలంకఁ దేరుపై
నొగ నొగ దాఁకఁగాఁ బఱపి♦నుగ్గుగఁ గౌరవసూతు నేసి బె
ట్టుగఁ దురగంబులం దునుము ♦ దున్ వెస నాతఁడు నట్ల
చేసెఁ బొ | టిగఁ గరవాలముల్ గొని వ ♦ డిన్ దిగి
నేలకు దాఁటి రిద్దఱున్ . 331

వ. అట్టిసమయంబున. 332

ఆ. వేగ మొయిది వృష్ణి ♦ వీరు భీముఁడు గురు
వీరుఁ గురువిభుఁడు ♦ గారవమున
నెనుకఁజనగఁ దివిచి ♦ తనతనరథముపైఁ
బెట్టికొనుచుఁ బోలఁగఁ ♦ బ్రీతిఁ జనిరి. 333

వ. అంత. 334

క. అపరాహ్ణసంగతుం డగు
తపనుం గని ప్రొద్దు గ్రుంకెఁ ♦ దడ వేఁగుదు రీ
రిపు లని కడంగి పరుఁ డ
స్త్రపరంపర వఱపి నీదు ♦ రథికుల నెల్లన్. 335

వ. నిహతులం జేయుచు విహరించు చున్నఁ గనుంగొని. 336

క. సైరింపక యేడ్తెఱఁ గురు
వీరాగ్రణి యిరువదేను ♦ వేలరథంబుల్
పోరికిఁ బురికొలిపిన వి
స్ఫారగతిం గూడి కవిసెఁ ♦ బార్థునిమీఁదన్. 337

క. కడువెసఁ గవిసినయవి గ
వ్వడి బాణజ్వాల లడర ♦ నడి దావాగ్నిన్
మిడుతలు వొలిసినక్రియఁ బొడి
పొడి యయ్యెం గురుబలంబు ♦ పొం గడఁగంగన్. 338

క. కిరణంబు లడఁగి యంతకు
నరుణత్వము మెఱయఁ దరణి ♦ యపరాద్రిశిరః
స్ఫురణను నధికరణాలం
కరణం బొనరించుటయును ♦ గాంగేయుఁ డెడన్. 339

క. శ్రాంతం బయ్యెను వాహన
సంతానం బెల్ల నిపుడు ♦ సంధ్యాసమయం
బింతట నేఁటికి నని సా
లింతము గా కింకఁ బోర ♦ లెస్సై యున్నే. 340

వ. అని తలంచి కుంభసంభవాదియోధముఖ్యుల కెఱింగించి బలంబులఁ దివియ నియమించి. 341

క. సమరక్రీడనలీలం
దమక తమక తనిసి మరల ♦ రసుత్తమయూధా
సహితులకు నరిగి రథయుక్తులై
న్యములజనంబులును దీవి ♦ యలు వెలుఁగంగాన్. 342

తే. గెండువీళ్లజనంబులు ♦ రేలు వివిధ
హృద్యసంగీతములను సా ♦ హిత్యమధుర
లలితగోష్ఠీవినోదంబు ♦ లను బ్రమోద
భరితులై ప్రౌఢపుత్త్రులు ♦ భరతముఖ్య. 343

భీష్మనిమహస్థనిపసయుద్ధక్రమము.

వ. ఏనననాఁటిరాత్రి సనటయుం దెలతెల వేగునప్పుడు ధనం జయుండు సేనాపతి రావించి మకరవ్యూహంబు సంఘటింపు మని నియమించిన నఖిలజనంబులకుఁ బ్రీతి నెక్కొన నతం డమ్మహారంబు దీర్చునెడ దానికిఁ బార్థపాంచాల పతులు శిరంబును గవలు గన్నులును భీమసేనుండు దుండంబును సౌభద్రద్రౌపదేయఘటోత్కచులు గండస్థలంబులును సాత్యకిసహితుండై యుధిష్ఠిరుండు గంఠంబును ధృష్టద్యుమ్నపురస్సరంబుగా విరాటుండు వెన్నును గేకయులు వామపార్శ్వంబును ధృష్టకేతుండును గాశపతియును దక్షిణపార్శ్వంబును గుంతిభోజశతానీకులు జఘనంబును శిఖండియు నిరావంతుండును బుచ్ఛంబునునై పన్నిరి భీష్ముండు దానికిఁ బ్రతివ్యూహం బూహించి క్రౌంచవ్యూహం బమర్చె నందు. ఐంచమునం దాను గురుసహాయుండై నిలిచె నేత్రంబులఁ గృపగురుపుత్రులును

మస్తకంబునఁ గృతవర్మయుఁ గాంభోజబాహ్లికులును గళంబున శూరసేనపరివృతుండై సుయోధనుండును నురంబున సౌవీరసమేతుండై భగదత్తుండును వీఁపున విందానువిందులును వామపక్షంబున సుశర్మయు దక్షిణపక్షంబున యవనపతియు నరభాగంబున శ్రుతాయురుపేతుండై భూరిశ్రవసుండును నిలిచి రిట్లుభయసైన్యంబులు సన్నద్ధంబులై నడచి శంఖభేరీప్రముఖతూర్యనాదంబులు సెలంగం దలపడిరి. నట్టిసమయంబున. 344

క. తలకడచి నడచు ద్రోణుని
యేఁపుఁ జలంబును సహింప ♦ కనిలతయుఁ డి
ట్టల మగురోషంబునఁ ద
ద్బలముపయిం బఱపె రథముఁ ♦ బటువేగమునన్. 345

వ. ఇట్లు వఱపిన నతనికో ల్తలకుం గాక. 346

క. తనముందటి యోధులు పిఱు
సనుటయుఁ గుంభజుఁడు గినిసి ♦ శరనవకము భీ
మునిమేన నాట నాతఁడు
సునిశితభల్లమున నతని ♦ సూతుం దునిమెన్. 348

క. వాహనముఁ దాన నడపుచు
సాహసికత్వమున గురుఁడు ♦ సమరక్రీడో
త్సాహము వదలక వైరి
వ్యూహము దలఁకంగ భుజన ♦ ముద్ధతిఁ గవిసెన్. 348

క. మీఁతంద్రి ద్రోణునకుఁ దో
డై తఱిమినఁ గేకయులు భ ♦ యాకులత మరు

ద్ధూతాంబుదగతిఁ దెరలఁగ
నాతతసృంజయబలంబు ♦ లఱిముఱి విఱిగెన్. 349

ఆ. అధిప భీమసేనుఁ ♦ డడరినఁ గౌరవ
సైన్య మతనిచేతఁ ♦ జాఁపకట్టు
వడియె నపుడు ధరణిపతు లిద్దఱును జేయి
వీచి తఱిమి రథిక ♦ విక్రమమున. 350

వ. ఇవ్విధంబున ధర్మనందనదుర్యోధను లగ్గలికం బురికొలుప
మొగ్గరంబులు రెండును గండు మిగిలి తలపడియె ననిన
విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 351

ఆ. మనబలంబునందు ♦ మంచిమగల్ సాలఁ
గలిగి యాబలంబు ♦ గెలువ లేమి
దైవకృతము గాదె ♦ తలఁపఁజోద్యము మున్న
యెఱుఁగఁజెప్పెవిదురుఁ ♦ డిట్టులగుట. 352

క. అతఁ డెంత సాటి చెప్పిన
మతిహితముగఁ గొనఁడా కీడు ♦ మానఁడు కడుదు
ర్మతియైన నాతనూజుఁడు
మతి గర్మమువెనుకఁ జనక ♦ మానునె యెందున్. 353

వ. విధికృతం బెవ్వరికి నుడుపవచ్చు నెట్లుగా నున్నద యట్ల
య్యెడుఁ గాక యనిన సంజయుం డతని కిట్లనియె. 354

ఆ. నీతనూభవుఁడు ♦ నెఱిగుఱి యెఱుఁగమి
నెఱిఁగి యెఱిఁగి యతని ♦ నేల చెప్ప
మనయుపేక్షవలన ♦ విను నాఁటిజూదంబ
నేఁడు గయ్యమయ్యె ♦ నృపవరేణ్య. 355

వ. ఇంకం బశ్చాత్తాపం బుడిగి ధీరుండవై సమరప్రకారంబు విను మట్టియెడ భీమసేనుండు భవత్సేనాసాగరంబు పాయ వడం దఱిమి చొచ్చి దుశ్శాసనుండును దుర్విషహుండును దుర్మదుండును దుస్సహుండును జయుండును జయత్సేనుం డును వికర్ణుండును జిత్రసేనుండును సుదర్శనుండును జారు చిత్రుండును సువర్మయుండును దుష్కర్ణుండును నొక్కచో నున్నం గనుంగొని యుక్కుమాఱులం దాఁకిన. ౨౫౬

తే. వార లందఱు నొండొరుఁ ♦ జేరి వేఁగ
బిలిచికొని వీఁడె చనుదెంచె ♦ భీముఁ డితఁ
డొంటి యగపడ్డచోట న ♦ యుక్కడంగఁ
జొదివి చంపుద మని యతి ♦ స్ఫురణ సేసి. ౨౫౭

క. ఉగ్రగ్రహములు లయకా
లగ్రహపతిఁ బొదువుక్రియ న ♦ లఘువిక్రమగ
ర్వాగ్రహమున ముట్టిరి రిపు
నిగ్రహలంపటుని భీము ♦ నిం జటులగతిన్. ౨౫౮

వ. ఇట్లు నీకొడుకులు చతురంగబలంబులతోడం జుట్టు ముట్టిన వృకోదరుండు సంతసంబునం బొదలి సారథిం గనుం గొని నీ వీరథం బిచ్చట నిలిపికొని యుండు మని నియో గించి గద పుచ్చుకొని ధరణికి లంఘించి. ౨౫౯

చ. కవిసి యుగాంతదండధరు ♦ కైవడిఁ గోలుమసంగి కుంభ
ముల్ | పవులఁగఁ దుండముల్ దునియఁ • బ్రక్కలు వ్ర
క్కలు గాఁగ దర్పముం జవము బలంబు నొవ్వఁగ గ♦జా

బుల వ్రేసిన నెత్తు రొల్కఁగా । నవి వడి ఘాతుని ర్ధ్వరమ॥
యాచలపంక్తులఁ బోలి మేదినిన్. 360

క. అరదంబులు పొడిపొడి యై
హరులగములు నుగ్గునూచ ♦ మై మొత్తపుఁగా
ల్వురు సిదురుప లై పడ ని
ష్ఠురగతి విహరించె వాయు ♦ సూనుఁడు గదతోన్. 361

క. పెక్కండ్రతోడ నిమ్మెయి
నొక్కరుఁడ రథమ్ము డిగ్గి ♦ యురవడిఁ జని పే
రుక్కునఁ బోరుట సూడఁగ
నక్కజమై యుండెఁ గౌర ♦ వాన్వయముఖ్యా. 362

ఆ. భీమసేను నపుడు ♦ పెక్కుబలంబులు
వొదువు కెఱిఁగి ద్రుపద ♦ పుత్రకుండు
శస్త్రగురునితోడ ♦ సరభసవృత్తిమైఁ
బోరి పోరి యుడిగి ç బుద్ధి గలఁగ. 363

క. భూరిరయంబున నద్దెసఁ
దేరు వఱపఁ బనిచి యతని ♦ తేరిపయిం ద
త్సారథిఁ గాంచి శోకము
గూరఁ గద్గదిక నెలుఁగు ♦ గుత్తుకఁ దగులన్. 364

తే. ఆర్తుఁడై యవ్విశోకుని ♦ నడిగె భీముఁ
డెచట నున్నాఁడు నాయొడ ♦ లెట్లు ప్రాణ
సహిత మై యుండు నతఁ డొక ♦ చందమైన
నేమిగతిఁ బోదు నక్కట ♦ యెఱుఁగఁ జెపుమ. 365

వ. అనిన విశోకుండు ధృష్టద్యుమ్నున కి ట్లనియె. 366

ల్లిక్కుల బఱచెం దమలోఁ
జిక్కు వడుచుఁ గౌరవేంద్రు ♦ సేనలుభీతిన్. 206

వ. అప్పుడు పెక్కండ్రు రథికులతోడం గూడి గాంగేయుం
డభిమన్యుపయిఁ గవిసిన, 207

తే. అతఁడు దానికి దలకక ♦ యందరకును
నన్నిరూప లై పోరంగ ♦ నర్జునుండు
సరభసంబుగ భీష్ముపై ♦ నురవడింపఁ
బొంగి యిరువాఁగు నిరువురఁ ♦ బొదివె బెరసి. 208

వ. అట్టిసంకులసమరంబున నభిమన్యుపై నడుకృపాచార్యుం
డాఁకి సాత్యకి బెడిదంపునారసంబు లేసిన వాని నన్నంటిని
నశ్వత్థామ గునిమి యతనివిల్లు ద్రుంచినం గోపించి. 209

క. ఆసాత్యకి వేఱొకవి
ల్లానురగతి నెత్తి యుగ్ర ♦ మగునారాచం
బేసిన నాతఁడు కేతు
వ్యాసక్తుం డయ్యె మూర్ఛ ♦ వచ్చి నరేంద్రా. 210

క. ఆలోనన తెలిసి మెఱుఁగు
వాలికతూపుఁ దతని ♦ వక్షమునడుమం
గీలించి సిడము ద్రెక్కన
నేలం బడ నేసి యార్చె ♦ నింగి వడంకన్. 211

వ. దానికిం గినిసి శినిమనుమండు పొగరు మిగులునారాచని
చయంబులం బొదివిన నశ్వత్థామ రాహుగ్రస్తుం డగును
గ్రగభస్తియుంబోలె నైనం గనుంగొని. 212

క. ద్రోణాచార్యుండు సుశ
త్రాణపరత్వమునఁ గృష్ణు • తమ్మునిపై న
క్షీణోద్ధతిఁ గవియుడు గీ
ర్వాణాధిపసుతుఁడు వచ్చి • వడి నెడఁ జొచ్చెన్. 213

చ. అనవుడు నాంబికేయవసు • ధాధిపుఁ డిట్లను ద్రోణుఁడా
త్మ న | ర్జునుననుఁ గూర్చు నాతఁడు గు • రుం గని యెంతె
యు భక్తి సేయు వా | రనిఁ దమలోన నట్లు వెస • నప్పు
డు దాఁకొని యెట్లు పోరిరో | వినఁ గల దేర్పడం జెపుము.
విశ్రుతభంగిగ నాకు సంజయా. 214

వ. అనిన నాసూతనందనుం డతని కిట్లనియె. 215

క. క్షాత్రము దలకొని సంగర
ధాత్రికి నేతెంచి గురులు • దండ్రులు దమ్ముల్
పౌత్రులు శిష్యులు మామలు
పుత్రు లనం గలదె తో • డరిపోరన వలయున్. 216

— అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధము సేయుట. —

వ. వినుము. 217

సీ. అర్జునుం డడరి ద్రో • ణాచార్యు మూఁడునా
రసముల నేసి యు • గ్రంపుటంప
వెల్లువ వఱపిన • వెగడొంద కాఁత డా
తనిమేనఁ దూపులు • దఱచు నాఁగ
నాటించె నంత భూ • నాథుండు పురికొల్పఁ
గాఁ ద్రిగర్తులు గురుఁ • గడచి కవియ

నరుఁ జేచి వాయుబా ♦ ణమ్మున నమ్మునఁ
దూలింపఁ గుంభజు ♦ శైలశరము
ఆ. వచ్చి యుడుప నలిగి ♦ వాసవి నారాచ
వర్షమునఁ ద్రిగర్త ♦ వరునిపుత్ర
చయముఁ దెరలుచుటయు ♦ జనపతి కృపశల్య
బాహ్లికులునుఁ దానుఁ ♦ బార్థుఁ దాఁకె. 218

వ. అట్లు దాఁకుటయు వారల నతండు గన్నె లాకమ్ములం జీకా
కుపఱిచెనట్లు గురుండు మొదలైనయందఱకును నాధనం
జయుపోరు దలమునుక లయ్యెఁ గురుపితామహుండు ధర్మ
సూతి యున్నయిట్టి కుతికి తలలు చెండాడె శకునిభూరిశ్రవ
సులు గవలం దలపడిరి కళింగపతియును భగదత్తుండును
విభసేనలతోడం దొడరి భీమసేనుం బోదివిన. 219

క. గిరి డిగు కేసరిచాడ్పున
నరదము డిగి భ్రమితపటుగ ♦ దాభీలత నా
కరువలిపట్టియుఁ గవిసినఁ
గరులుఁ దెరలెఁ బవనధూత ♦ ఘనపంక్తిగతిన్. 220

తే. క్రందుకొని యిట్లు మాతంగ ♦ ఘటలు విఱుగ
నాశ్రుతాయువుఁ బ్రాగ్జ్యోతి ♦ షాధిపతియుఁ
బోక నిలచి యమ్మారుత ♦ పుత్రుఁ జోడుఁ
దనువుఁ జించిరి వివిధాస్త్ర ♦ తతులు వఱపి. 221

వ. అప్పుడు గాంగేయుండు సేయుదారుణరణంబు ధర్మపుత్రు
నకు భరంబైన నతండెలుం గెత్తి పేరువేరం బిలిచి చేయి

పేచిన నాగళింగనాథభగదత్తుల విడిచి యప్పుడు గవ్వు
చుచు. 222

క. కలయఁగఁ గరములఁ జరణం
బుల నురమున శోణితంబు ♦ బోరన దొరఁగం
దలి రెసఁగిననడమామిడి
చెలువ్రునఁ బఱతెంచె భీమ ♦ సేనుఁ డచటికిన్. 223

వ. అంతకు మున్న ధృష్టద్యుమ్నశిఖండి విరాటద్రుపదులు
ధర్మనందనున కడ్డపడి భీష్ముపై నడచి బహుప్రకారవిశిఖం
బుల నెగడుపఱచిన నతం డలిగి శిఖండి నేయ నొల్లక
యమ్మువ్వురను మూడేసివాఁడితూపుల నేసిన నా
వీరరథికులు హుతాగ్నిత్రయంబునుంబోలెఁ బ్రజ్వలించి
బాణజ్వాలలు నిగిడించి యతని నొప్పించిరి వృకోదరుఁ
డద్దెసం గవియుటం గనుంగొని కేకయగణంబు నేయద్రౌ
పదేయులు గూడుకొని కవిసినం గౌరవసేనం జేయం గల
మేటిమగ లెల్లను మిన్నేటి కొడుకునకుం దలకడచి వారిం
దలపడిన నిరుదెఱంగులదొరలును బలంబులును నొక్క
మ్మడిం గ్రందుకొన బెరసి పోట్లాడు చుండం జండరశ్మి
వినువీధిచక్కఁ సగంబునకుం జనుదెంచె నట్టియెడ. 224

తే. రథములను సామజములఁ దు ◦ రంగమములఁ
నుఱక నెత్తురుటేఱులఁ నీఁది ♦ తఱియ నడచి
పోరి రేటునఁ బ్రేటును ♦ బోటు నొక్క
యొలబిఁ జెలఁగంగ నుభయమైన ♦ న్యములవారు. 225

వ. అప్పుడు మనబలంబులజనంబులు. 226

క. ధృతరాష్ట్రుండును బుత్రులు
నతిలోభంబునఁ బ్రజాక్ష ♦ యము సేసిరి ధ
ర్మతనూజు గెలువవచ్చునె
మతి లేరై రింక నేటి ♦ మాటలు మనకున్. 227

ఆ. అనుచు వగచుపలుకు ♦ లాలించుభీష్మాది
యోధవరులతో సు ♦ యోధనుండు
చెనఁటిమాట లేమి ♦ వినియెద రనిన వా
రదియు నదియు వినని ♦ యట్లపోలె. 228

వ. పరాక్రమక్రీడలు సలుపు చుండి రాసందడికయ్యంబునం
గిమ్మీరమర్దనుండు గదపంపువు సేయు చుండె నప్పుడు. 229

క. సరభసముగ సారథి దన
యరదముఁ దెచ్చుటయు నెక్కి ♦ యతినిశితశర
స్ఫురణాపరిణతి బాహ్లికు
విరథుఁ గావించె సురలు ♦ వినుతింపంగన్. 230

తే. చిత్రసేనుండు సౌభద్రుఁ ♦ జిత్రబాణ
పాతమున నొంచి యార్చినఁ ♦ బాండుపౌత్రుఁ
డతనిసారథిఁ బడ నేసి ♦ యంతఁ బోక
తురగములఁ జంపి యాతని ♦ త్రుళ్ళడంచె. 232

వ. అక్కుమారుండును దుర్ముఖునిరథం బెక్కెఁ బాంచాలపతి
గుంభసంభవుపై నడరి యతనిమేన నానాస్త్రంబులు నిం
చిన, 232

క. ద్రోణుఁడు గోపించి తను
త్రాణం బలువుళ్ళు సేసి ♦ తనువున రాజ

ద్బాణంబులు గ్రుచ్చిన సం
క్షీణబలుండై యతండు ♦ సి గ్గతి తోలఁగెన్. 233

సీ. తఱిమి సుశర్ముండు ♦ దాఁకి యర్జును నొంచి
కృష్ణుపై నమ్ములు ♦ గీలుకొలుప
నలిగి యన్నరుఁడు వా ♦ లంపకోలువ లోలి
నడరించుటయు వాని ♦ యఖిలబలముఁ
జేతిసమ్మెటలను ♦ జేరుకోలల ప్రేసి
యంకుశంబుల నూఁటి ♦ యతిరయమున
వాహనంబులఁ దోలు ♦ వారును విండ్లును
బలకలు వైచుచుఁ ♦ బఱచువారు

తే. నైన మీఁతండ్రి క్రీడిపై ♦ నడర నడుమఁ
జొచ్చె సాత్యకి యన్నదీ ♦ సుతుఁడు శక్తి
వైవ మెయివాల్చియది వట్టి ♦ వైచె మగుడ
నాతఁడాభీష్ముఁడెడఁదును ♦ మాడెనధిప. 234

వ. ఇట్లు ద్రుంచి. 235

క. ఆలోచన మెయిఁ దొమ్మిది
వాలమ్ములు నాటఁ బొంద ♦ వవ్యూహము శుం
డాలరథఘోటసుభటా
భీలతఁ దలకడచి పొదివె ♦ భీష్ముని నంతన్. 236

దుర్యోధనుఁడు శకుని దుశ్శాసనుల భీష్మునకు సహాయంబుగాఁ బంపుట.

క. కని గౌరవపతి దుశ్శా
సనుతో నిట్లనియెఁ గంటె ♦ శాంతనవునిపై

ఘనసేన ద్రోచెఁ జని కై
కొనుఁ డీవును సౌబలుఁడు న • కుంఠితవృత్తిన్. 237

క. అనవుడు నయ్యిరువురు నే
పునఁ గదియుడుఁ జూచి ధర్మ • పుత్రుఁడు మాద్రీ
తనయులు నడరిన దుర్యో
ధనుఁ డప్పుడు తురంగమాయు • తముఁ బురికొలిపెన్.

వ. ఆపదివేవురు నెఱరావుతులు నొక్కపెట్ట శకునిదుశ్శాస నులకుం దలకడచి యెక్కినం బాండవబలంబు మహామ త్స్యసమూహావిహారంబునం గలంగుమడువునుం బోలె సంక్షోభించినం గోపించి కౌంతేయాగ్రజుండును గవలును వివిధవిశిఖపరంపరలు వరఁగింప ముందటికాళ్ళు దునిసిన గ్రుమ్మగతిలఁబడియును మోరలు పఱియలై నెఱి దప్పం గూలియు గుండియ లవిసిన నెగసి కెడసియు వాగెలు దె వ్విన వలియం బాఱియు నాశ్వికులు నేల కొఱగినఁ జెనఁటి దిరిగియు ననేక ఘోటకంబులు గూపఱిన నేపఱి యుత్తురంగనికరంబు లేట మొగంబునడి చెదరికనుఁకనిం బఱచిన. 239

క. భేరీశంఖాదిరవ
స్ఫారత నప్పాండుపుత్ర • బల మేచుటయుం
గౌరవపతి శల్యునితో
గారవమున నిట్టు లనియెఁ • గడు దీనుండై. 240

క. వెలివిరిసి వచ్చుజలనిధి
పొలుపునఁ దోఁతెంచు ధర్మ • పుత్త్రునిబలుగో

ల్లల నిలువరింప నీవొక
చెలియలికట్టవయి మమ్ముఁ • జేకొను మిఁచటన్. 241

ఆ. అనుడు నతఁడు పాండ • వాగ్రజుఁ గవలును
దాఁకి విపులబాహు • దర్ప మొప్ప
నారసములఁ బొదివి • మారిమసంగిన
ట్లయినఁ జూచి నరుఁడు • ననిలసుతుఁడు. 242

క. ఒక్కటఁ గడంగి శల్యుని
బెక్కమ్ముల నొంచుటయును • భీష్మద్రోణుల్
గ్రక్కునఁ దఱిమిన నయ్యిరు
దిక్కులసైన్యములు నత్యు • దీర్ణత బెరసెన్. 243

వ. ఇట్లు గలయఁ బెరసి యపరాహ్ణంబున నుభయచతురంగ మథనం బగుప్రథనంబు సేసె నట్టియెడ భీష్మగ్రీష్మాదిత్యుండు వేఁడి మిగిలి వాఁడి మెఱసిననారసంబు లను కిరణంబులు వరఁగించి. 244

సీ. పంద్రెంటఁబంద్రెంటఁ • బాండవాగ్రజుని భీ
మునిమాద్రికొడుకుల • మూఁటమూఁట
నేడింట నేడింట • నేచి సాత్యకిని ధృ
ష్టద్యుమ్ను నొప్పించి • సమదవృత్తి
నార్చిన మాత్స్యపాం • డ్యానీకములును సో
మకవరూథినియును • మగధబలముఁ
గాశసైన్యంబుఁ గ • రూశసేనయు నొక్క
పెట్ట రయంబున • భీష్మమీఁద

తే. సురవడించినఁ బాండవో ♦ త్కరముఁ గృష్ణ
తమ్ముఁ బాంచాలనందను ♦ సమ్ముఖమున
కడర నీఁ గాంగి యందఱ ♦ కన్నిరూపు
లై మహారణ మొనరించె ♦ నస్త్రగురుఁడు. 245

ఉ. శాంతనవుం డనేకబల ♦ సంతతి నుద్భటశౌర్యసారదు
ర్గాంతపరాక్రమస్ఫురణ ♦ దాఁకి సముద్ధ్వలశాతసాయక
క్రాంతపరీతనిర్మథిత ♦ కంపితపాతితమూర్తిఁ జేసి య
త్యంతరయంబునం దఱర ♦ ధంబుగతుల్ మెఱయం బ్రదీ
ప్తుఁడై. 246

మ. గజరాజోజ్జ్వలఘంటికావళిఁ దురం ♦ గప్రస్ఫురత్కింకిణీ
వ్రజముం గాహళదుందుభిప్రభృతితూర్యశ్రేణులన్ సుందర
ధ్వజఘంటాతతులన్ శరాసనగుణ ♦ వ్రాతంబుఁ దున్మాడి ధ
ర్మజసేనాతతి ముంపఁ జేసెఁ బటుదో ♦ ర్గర్వం బఖర్వంబు
గాన్. 247

వ. ఇట్లు బల్లిదుం డయి మల్లడిఁ గొని మాఱొక్కన మగలు లేక మదంబునం బొంగి గాంగేయుండు పాండవేయులు వెఱగుపడ మఱియునుం గడంగి దుర్వారంబు లగు దివ్యాస్త్రంబులు దీటుకొల్పి యేడ్కసూచినందాన యైన రథికులను హాస్తికులను నాశ్వికులనుం దునిమిన గంధసింధురక్రీడనంబున బ్రోడుపడినయుద్యానంబుచందంబున నగుచున్నచోట్లును గాలుబలంబులం గనుపకొట్టినం గాలు చేయి తల దొక్కయని యేఱుపాటులేక వండందఱిగినయట్లున్నయెడలును బెక్కుదెఱంగులచప్పళ్ళునిగుడరథచయం

బునవయవనిబులుం గరిహయనికరంబు లయ్యెమ్ములు విఱు
గంగార్చిచ్చుపొడిచిన నెదురుబడవి తెఱంగునం దోఁచుపట్లును
దఱుచు గొడుగులు విటతాటనంబు సేసినం బెనుగాలిం
జిక్కువడిన కుసుమితకాశవనంబునుం బోలు చక్కట్లును
బహురత్నమయ మకుటాదిభూషణవ్రజంబు వివిధవర్ణచామర
జాతంబు నఱికి పడవైచినం బ్రబలోద్ధతలులాయములిత్రొ
బయి కమలకైరవోత్పలాకీర్ణం బగుకొలని ననుకరించుప్ర
దేశంబులును నై పాండవసైన్యంబులు దైన్యంబు నొందియుఁ
గలగుండుగొనియు బెండుపడియుఁ గలంగం బాఱియుఁ
దోలంగం దెరలియుం గోలాహలబహుళంబులగుట గనుం
గొని గోవిందుండు. 247

ఉ. అర్జున చూచితే మనబలావళి నెల్లఁ గలంచు చున్నవాఁ
డూర్జితశౌర్యసంపదయు నుగ్రభుజాబలవైభవంబు వి
స్ఫూర్జితవిక్రమోద్ధతియుఁ జూపె నదీసుతుఁ డిట్టిచోట నీ
మర్జమునప్పచిభ్రమము నోవఁగఁ జేయకయుక్కుమొప్పనే.

వ. అనిన విన్వచ్చ్సాను విచారడోలాయమానంబగు చిత్తంబు
తోడ నిరుత్సాహుండై యున్నం జూచి వెన్నుం డతని
కిట్లనియె. 249

క. మును మత్స్యనాథునగరం
బున నాజమున గోత్రపుహాగును బెట్టా
డినమాట లెల్లమఱచిన
నిను నగరే రథికవరు లనింద్యచరిత్రా. 250

వ. అనుటయు నర్జునుండు. 251

ఆ. సకలబంధుజనులఁ ♦ జంపి కౌరవహీన
మైనరాజ్యమహిమ ♦ యేను బడసి
యనఘ యేమిసుకృత ♦ మాచరించినవాఁడ
నగుదు మనసు గొలుప ♦ దయ్యె ననిన. 251

వ. అయిన నీతో నప్పటప్పటి కేటిమాటలు గలవు మిన్నేటి కొడుకుం బడ త్రైచెదం దేరు నడపు మనుటయు నారాయ ణుండు నదీనందనస్యందనంబునకు సమ్ముఖంబుగా రథ్య మ్ములం ద్వరితగతి నడపినం జెరలిన సైన్యంబులు గూడి కొని గాంగేయు పయిం గవియ నతండు సెలంగి మహా స్త్రనికరంబులు నిగిడించి యబ్బలంబు నిలువరించి సింహ నాదంబు సేసి. 253

మ. ఖరనారాచ పరంపరోగ్రనిహతిం ♦ గాండీవియంగంబు లా | తురం బొందఁగ నేసి బాణమయుగా ♦ త్రుం జేసి గోవిందు ని | ష్ఠురలీలం దురగంబులం బటుశర ♦ స్యూతాస్యముల్ గాఁగ స | త్వరుఁడై యేసిరథంబు గూడఁ బొదివెన్ ♦ వాలంపమొత్తంబునన్. 254

వ. అప్పుడు

తే. బీఱువోయి రథ్యంబులు ♦ మాఱుమొగము
వడినఁ దా నొచ్చి యుండియుఁ దడవి శౌరి
నూలుకొనఁ జేసి తరిమిన ♦ వ్రాలి తీవ్ర
భల్లమునఁ గ్రీడి భీష్ముని ♦ విల్లుదునిమె. 256

క. అతఁ డొండకవిల్లెత్తిన
నతిరయమున నదియుఁ దునుమ ♦ నాతండోరా

శతమఖనందన యనుచును
ధృతి వేఱొకవింట శరతతిం బరఁగించెన్. 257

క. ఆ బెట్టిదఁపుటంపఱ
చే బీభత్సుండు నొచ్చి • చేడ్పడి మఱియుం
దా బంటుతనము పటుబా
హాబలముగఁ బోరుచుండె • నంగముదూలన్. 258

క. వివ్వచ్చునొవ్వ నెంతయుఁ
గ్రొవ్వున భీష్ముండు గడఁగుకోల్తలయుం ద
క్కెవ్వరు నాతనిఁ జేరక
దవ్వుల నిల్చుటయుఁ జూచి • తనచిత్తమునన్. 259

క. దారుణరోషం బడరఁగ
నారాయణుఁ డప్పుడు సైరింపం దొరఁగి వెసం
దేరినొగలఁ బగ్గము లిడి
క్రూరత ముని కోల యెత్తి కొని యిల కుఱికెన్. 260

శ్రీ కృష్ణుఁడు రథంబు డిగ్గి భీష్మునిపైకిం బోవుట.

వ. ఇట్లు లంఘించి. 261

మ. ధరణీచక్రము గ్రక్కునం గదల • దిగ్దంతావళశ్రేణికం
ధరముల్ గ్రుంగ్గఁబడన్ నదీశావలయ ముత్కంపంబు గానీబలం
బురలన్ బాఱఁగ భీష్ముపైఁ గవిసె రౌద్రోద్రేకముం జూచి ఖే
చరలోకంబును సంచలింపహరి • చంచచ్చక్రబాహుఘోరాకృతిన్.

తే. లలితపీతాంబరంబువిలాస మొప్ప
సింహనాదోద్ధటం బగు • చెలువుతోడ

మెఱుఁగు వెలుఁగును గర్జయు ♦ మఱయువచ్చు
కారు మొగి లన గృష్ణునా ♦ కార మొప్పె. 263

వ. అట్టియెడ 264

క. బలుజీవము వోయిన వెల
వెలఁ బాఱుచు నీదుయోధ ♦ వీరులు వొలిసెం
బొలిసెనదె భీష్ముఁ డనుచును
గలఁగం బడి యఱ్ఱులెత్తి ♦ కనుఁగొనుచుండన్ 265

చ. కనుఁగొని భీష్ముఁ డుల్లము వి ♦ కాసము నొందఁగ నల్ల
నవ్వి యి ట్లను జనుదెమ్ము వేగమ మ♦హాత్మ వికస్వర
పుండరీకలోచన యిది లెస్స నా ♦కిచట ♦ శాశ్వత మైన
యశంబు వచ్చుట న్నీను తికి న్యెక్కుసద్గతియు ♦ నీదయ
జేకుఱఁ జేయు మిష్టముగ 266

వ. అని పలుకునంత జృంభాంతకసూనుండు సరభసంబుగా
రథంబుడిగ్గి నుఱికి పెన్ను వెనుక నెయిది కరంబుల గ్రుచ్చి
పట్టిన నతండును దిగిచికొని వెండియుంబోవం బోవఁబడి
యడుగులకొలంది నాక్రాంతియుండు వదస్థైర్యంబును
బాహువీర్యంబును మెఱయ మహీతలం బూని మెట్ట
నిలువం బట్టినిట్టూర్పు నిగిడించుచు నద్దనుజమర్దనుతో
నిట్లనియె. 267

ఉ. కయ్యము నేయ నే ననియు ♦ కల్మషబుద్ధి ప్రతిజ్ఞ సేసి నీ
వియ్యెడఁ దప్పితేని జగ♦ మేమను నించుక సేపు పోరులకు
డయ్యుట దప్పె నావయిఁ గ ♦ డంగినభీష్మునిపాటుసూతు

రావయ్యె రథంబుమీఁది కిటు • లాశ్రితమానమువీఁటి
బుత్తురే. 268

వ. అని ప్రార్థించినఁ బార్థుపలుకులకుం బ్రియం బంది ముకుం
దుండు మఱియు నరదంబు వఱపుచు నెక్కినయరదంబు శిఖ
రద్వయసుందరం బైనశైలంబునుం బోలెఁ బొలిచి నిలిచినం
బ్రళయకాలభైరవుండునుం బగువారిదంబుకరణి గర్జిల్లుచుఁ
బలునారాచపటలాసారంబు నిగిడించి వారల వెగడుపఱిచి
యచ్చట నొండొరుల మెచ్చక యతిని తఱిమిన వైరివీ
రుల రూపుమాపి భీష్ముండు భీషణాకారుండై పరిశ్రాంతు
లైనకృష్ణార్జునులును భీతు లగుభీమసేనప్రముఖులును జేయు
నది లేక చూచుచుండం బాంచాలబలంబుల బారిసమరు
నప్పుడు బలుమానిసి నలిచీమలం గాలం జమరుచందంబు
దోఁచె. నయ్యవసరంబున. 269

క. తానస్తశిఖరి నుఱువడఁ
బోనియపుడు పాండురాజ • పుత్త్రనిరాజ
త్సేన పొడ వడఁగు ననుకృప
నో నలినాప్తుండు గ్రుంకె • నుర్వీనాథా. 270

వ. అట్టియెడ ధర్మతనయుం డతిఘోరం బగుసంధ్యాసమయం
బునం బరనిర్మగ్నమైన నావునుంబోలె నున్ననిజసేనం
జూచి యొక్కింతసేపు చింతాక్రాంతుండై యప్పటికిం
దిగుచుటయు కర్జంబుగాఁదలంచి తగువారల నెల్ల దివియ
నియమించి. 271

క. గాంగేయుచేత నొంతయు
భంగపడితి మనుచుఁ వగచు ♦ పార్థాదులుఁ ద
న్నుం గొలిచి చనఁగ విడిదల
కుం గను విన్ననగు పోయెఁ ♦ గురువంశనిధీ. 272

వ. ఇట్లు పాండవవ్యూహంబు లోపాటించి పోయినం దారును
సమబలంబులఁ దివియ నియమించి. 273

చ. ఎలమి నమస్కరించుచు న ♦ హీనపరాక్రమభంగు లేర్ప
డం బలికి యుదాత్తవాక్యముల ♦ బ్రస్తుతి సేయుచు భీష్ము
నందఱు స్వలసి భవత్తనూజులు మ ♦ నంబులు నిండి ము
దంబు మోములఁ వెలి విరియంగ నేఁగిరి న ♦ వీనవిభూతి
నివాసభూమికిన్. 274

వ. ఇట్లు ధర్మతనయుండు దొమ్మిటివనాఁటిబవరంబున బెండు
పడి యానిశాసమయంబునందు రహస్యప్రకారంబున. 275

క. మనమున విషాద మడరఁగ
ననుజులఁ గూర్చికొని దాన ♦ వాంతకుసదనం
బునకుం జని యిట్లను నా
తనితో నాత్మీయకార్య ♦ దశ దెలియుటకున్. 276

క. కార్చిచ్చు గవిసి మృగతతి
నేర్చుకరణి నేఁడు భీష్ము ♦ డేచినకడిమిం
బేర్చి మనసేనఁ బొదివె శ
రార్చుల నవ్వీరుఁ గన్ను ♦ లారం గంటే. 277

ఉ. మనవారెవ్వరు నోర్వ రాతనికి దు ♦ ర్వానంబునం జేసి యె
మ్మును గార్యస్థితిఁ గాన నైతి విను ని ♦ ర్మూలంబుగాఁ బోరఁ జ

చ్చిన సామ్రాజ్యము గొన్నయట్లగునె ని ♦ శ్చింతంబునం
గానవనం । బునకుం బోయెదఁ దమ్ములం గొని తపఁ ♦ పూ
జ్యుండనై యుండెదరా. 278

క. మున్నును నేఁ గారణము గ
నన్నియిడుమ లనుభవించి ♦ రనుజులు వీరిం
గ న్నారఁ జూతుఁగాని జ
గన్నుత భీష్ముసకుఁ గోలు ♦ గా నీఁజాలన్. 279

వ. నీకు మాదెస ననుగ్రహంబు గలదేనిఁ గయ్యంబు దక్కి
ధర్మవిరోధంబు గాకుండునట్టియొక్క తెరువు సెప్పు మని
సకరుణంబుగాఁ బలికిన విని శౌరి సాంత్వన వచనంబులన
నునయించి యతని కిట్లనియె. 280

క. సత్యప్రతిజ్ఞుఁడవు నీ
వత్యద్భుతబాహువీర్య ♦ లనుజన్ములు దా
ర్గత్యము గల్గునె నీకు వ
మాత్యుఁడ నై యేను రాజ్య ♦ మహిమ నొసర్తున్. 281

క. వగవఁగ నేటికిఁ బార్థుఁడు
దెగువకుఁ జోర కున్న భీష్ముఁ ♦ దెగఁ జూచి వెసం
బగ యడఁగించెద నన్నున్
మగిడింపక చూచు చుండు ♦ మనుజాధీశా. 282

తే. సఖుఁడు సంబంధి శిష్యుండు ♦ సవ్యసాచి
నాకు నతనికి నై యేను ♦ నరవరేణ్య
కూర్మిమై నిత్తుఁ గండలు ♦ గోసి యైన
నరయ నాతఁడు నాయెడ ♦ నట్టివాఁడ 283

వ. ఉపప్లావ్యంబున నతండు సంజయుతో నాడినబలుమాటలకు
నులూకుండు వచ్చినప్పు డతనిపలుకులం బుట్టినబెట్టిదంపుం
దనంబునకుం దగినయంత నాకుం జేయ వలయు నేను
నీకెండెకలం బెక్కులు వలికినవాఁడ మా కిపుడు నొం
డొరువుల పలుకులు పరిపాలించుట సమయం బయి యుం
డు ననిన వసుదేవనందనునకు ధర్మనందనుం డిట్లనియె.

క. కయ్యము సేయక తగుసా
హాయ్యము సేయఁ గలవాఁడ ♦ నని పలికితి ని
న్నియ్యెడ నే బొంకింతునె
దయ్యము నా కేల యిట్టి ♦ దైన్యము దెచ్చెన్. 235

వ. నాకు దేవవ్రతునకు నొక్కసమయంబుగల దమ్మహాత్ముం
డు గౌరవులకు నయి కయ్యంబు సేయుటకును నాకు హితం
బగు కార్యంబు బుద్ధిం దలకొనుటకుం బూనినవాఁ డతండు
రాజ్యం బొసంగు నని పలికి సఖేదంబుగా నిట్లనియె. 286

ఆ. అకట తండ్రి నచ్చి ♦ నంపెనుండియు నును
నరసి పోచినట్టి ♦ యనుఁగుఁ బాశఁ
జంప మదిఁ దలంచు ♦ తెంపు సూచితె రాజ
ధర్మమింత క్రూర ♦ కర్మమగునె. 28

వ. అనవుడు. 288

తే. వినిము రాంతకుఁ డితఁడు శాం ♦ తనవుకడరు
నరుగఁ జూచినవాఁ డని ♦ యాత్మ నెఱిఁగి
క్రమ్మఱంగ నే తెంచెదు ♦ గాక యనిన
యన్నదీసూను తొంటివా ♦ క్యములు దలఁచి. 289

వ. అజాతశత్రుున కిట్లనియె. 290

ధర్మరాజు రహస్యప్రకారంబున భీష్మునియొద్దకుఁ బోవుట.

ఆ. నీతలంపు లెస్స ♦ నీవు మున్ననినట్ల
కాక భీష్ముఁ డలుక ♦ గదిసి పోరఁ
జక్కఁజూచె నేని ♦ శత్రువుల్ వాలింపఁగ
యిప్పు డతనిపాలి ♦ కేఁగు మధిప 291

సీ. నీవు న న్నడిగిన ♦ నిజవధోపాయం బ
వశ్యంబుఁ జెప్పు దే ♦ నప్రతకాండు
మనసు రహస్య ♦ వర్తనమున నంపఁడు
మును జని యమ్మహా ♦ త్మునకు భక్తి
నెఱఁగి తెల్లంబుగ ♦ హితకార్యగతి విన
యంబునఁ బ్రార్థించి ♦ యడిగి యతని
సదయమంత్రోపదే ♦ శంబున నెగడుము
మని యిట్లు హరి నిశ్చ ♦ యంబు సేయ

ఆ. నయ్యజాతశత్రుఁ ♦ డనుజులు నతఁడును
దాను సౌమ్యవేష ♦ ధరణ మొప్ప
నతనిఁగూడ వృత్తి ♦ నాపగాసుతుమంది
రమునకరిగి సముచి ♦ తముగఁ జొచ్చి. 292

వ. అతనిం గాంచి యధికభక్తిం బ్రస్తవనపూర్వకంబుగాఁ దత్పా
దంబులకుం బ్రణమిల్లిన నతం డత్యాదరంబునఁ బేరువేర
వారలందఱ సేమంబు లడిగి యిట్లనియె. 293

క. ఇచ్చటికి మీర లందఱు
వచ్చినపని యేమి యేమి ♦ వలసిన నడుగుఁ

డిచ్చెద దుష్కరమైనను
జెచ్చెరఁ దలఁకొని ఘటింపఁ ♦ జేసెద బ్రీతిన్. 294

వ. అని తెలి వొందినమొగంబుతో నడిగిన దీనాసుండగుచు ధర్మసూనుం డతనికిట్లనియె. 295

క. మాకెమ్మెయి సామ్రాజ్యము
నేకులు నెబ్బంగి బహుళ ♦ సేనోత్పాద
వ్యాకులత రాక తక్కం
జేకొని యత్తెఱఁగు కరుణఁ ♦ జెప్పఁగవలయున్. 296

క. అనవుడు నేఁ బెనఁగఁగ మీ
కనఘా సైన్యక్షయంబు ♦ నగు సామ్రాజ్యం
బును గా నేరదు గావున
నను నిర్జింపంగ శో ♦ భనము లెల్ల నగున్. 297

వ. అని పలికిన శాంతనవునకుం గౌంతేయాగ్రజుండు. 298

ఉ. చిచ్చఱకన్ను మూసికొని ♦ చేతి త్రిశూలము డాఁచి లీల
మై । వచ్చినరుద్రుచందమున ♦ వ్రాలుదు వీ వనిలోన నో
ర్వఁ గా । వచ్చునె నిన్ను నెట్టిమగ ♦ వారికి నీకృప నాశ
యింపఁగా । వచ్చితి మెవ్విధిఁ గెలువ ♦ వచ్చు మహాత్మ
మొఱుఁగఁ జెప్పవే. 299

క. అనుటయు నిట్లను గంగా
తనయుడు నీ చెప్పినట్ల ♦ తథ్యం బది న
న్ననిమిషులు గెలుతురె చే
ధనువుండఁగ వినుము తద్వి ♦ ధము చేటపడన్. 300

తే. ఇట్టివానిఁగ నన్ను మీ ♦ రెఱిఁగి యిచటి
కిందఱును వచ్చి యక్కటా ♦ యిట్టులడుగ
మీకుఁ బ్రియ మైనకార్యంబు ♦ మెయికొనంగఁ
గనుటకంటెను సుకృతంబు ♦ గలదె నాకు. 301

వ. ఏ నాయుధవ్యాపారంబువలన నుదాసీనత్వంబు నొందినను నన్ను జయింపసమకూరఁగు జోకఁ బుచ్చినవానిని గైదువుఁ బెట్టినవానిని సిడంబు డించినవానిని నంగనను నంగనాపూర్వుని నంగనాభిధానునిఁ దలచీర వీడినవానిని భాగ్యహీనున పుత్రకునిం గని పెలుచఁ బోటుఁ దక్కి సమరంబు సేయ మానుదు మఱియు నొక్కవ్రతంబు పూనినవాఁడం బుట్టినప్పుడు లేక నడుమ దైవం బిచ్చినపురుషత్వంబు గలవానితోడఁ గయ్యంబు సేయం గావున మీకు నుపాయంబు సెప్పెద ద్రుపదునపత్యంబైన శిఖండి యట్టివాఁడగుట మీ రెఱుంగుదుర కాదె విశేషించి ముందటిపుట్టువున నంగనయగుట వాని కెదురు సేయ కుందుదు నర్జునుండు వానిం బురస్కరించుకొని వచ్చి యే నేయుట మానినయెడ నొప్పించి పడవైచునది పదంపడి బంధుమిత్రులగు ధార్తరాష్ట్రుల గెలుచుట సుకరంబగునిది నాపనుపేను బనిచినట్ల చేయుండని సహృదయంబుగాఁ జెప్పిన నట్లు దేవవ్రతుచేత ననుజ్ఞాతులై వార లతనికి నమస్కరించి వీడ్కొని విడిదలకుం బోవుచున్న సమయంబున బీభత్సుండు. 302

ఆ. సురనదీసుతుండు ♦ పరలోకగతి నిరీ
క్షించుటకును దాను ♦ గృతకవృత్తిఁ

జంప వలయుటకును ♦ సవిషాదమానసుం
డగుచు నిట్టు లనియె ♦ నచ్యుతునకు. 303

క. గురునిఁ గృతప్రజ్ఞుని ధ
ర్మరతుఁ ప వయోవృద్ధు లోక♦మాన్యు దయాళుఁ
సురతటినీసుతు వంచనఁ
బురుషోత్తమ చంప బుద్ధి ♦ పుట్టదునాకున్. 304

ఆ. నన్నుఁ బాంశుకేలి ♦ నున్న నర్మిలి నెత్తి
మేనిధూళి దనదు ♦ మేను వొరయఁ
బ్రీతిఁగౌఁగిలించి ♦ మాతండ్రిగుణము ల
గ్గించి కన్ను నీరు ♦ నించు నతఁడు. 305

ఉ. అక్కట తండ్రిలేనిమము♦నమ్మయి పెంచినతాతనిమ్మెయిం
ద్రెక్కొనఁగా దతండు సము♦దీర్ణభుజాబలశౌర్యశాలినై
యిక్కడిసేనఁ జక్కడిచె♦నేనియుఁ జూతునకాక ధర్మముం
దక్కటకోర్వఁ జాలుదునె♦ధర్మజుతమ్ములు క్రూరకర్ములే.

వ. అనిన విని కృష్ణుం డాజిష్ణున కిట్లనియె. 307

ఉ. క్రూరత కోర్చి యించుకయు ♦ రోయక పైకొని మొల్ల
భంగులన్ | వైరులఁ జంపి భూప్రజకు ♦ వర్ధనము ం గలిగిం
చి పాడిమైఁ | గోరరి గొంచు సద్వ్యయము ♦ గోరియున
ర్పుట రాజధర్మవిస్తారముగా బలారికి ♦ వచస్పతి సెప్పుట
యుప్రసిద్ధమే. 308

చ. అనియెను నోర్తు భీష్మునసి ♦ యాడినసీదగుపూర్వ లోక
మెల్లను విని యుండఁగా నిటు చ ♦ లం బెడలం జనదెట్టు
లైనఁ జంపన తగు రాజధర్మపరి ♦ పాలన గా కిది క్రూర

కర్మమే ! నిను విధి పంపఁ గొంతెకవు • కం బెగటార్పఁగ
వేయునేటికిఁ, 309

చ. అనుటయుఁ గ్రీడి యిట్టు లను • నా మనపదాత్మజుజన్మ
మూపగా | తనయువధార్థ ముం బ్రతిఁయుఁ • చప్ప దపుం
డును వాని నేయఁ డేటికి నకని నేయుచుండమున • నూ
ల్కాని యన్యులఁ నేయు చుందు వాఁడనితరవధ్యకాయుఁ
డగు • నాయనఁ దాఁ బడ నేయు నుగ్రతన్. 310

వ. అనవుడు నవ్వి కవ్వడికిం గమలనాభుం డిట్లనియె. 311

ఉ. నీ వాకరుండు దక్కఁగ నవనింద్యపరాక్రమశాలి భీష్ముని
జావఁగ నేయ నెవ్వఁడును • జాలఁడు నేతలఁ బెన్నిభంగు
లఁ | దైవముచూపువో లెఁ దుది • దాఁకునె యవ్విధమి
ట్టు లుండఁగాఁ | ద్రోవఁగ వచ్చునే యెటులుఁ • ద్రోచిన
బోవదు చూచి యుండుమిా. 312

వ. అని పలికిన విని యతం డట్ల కాక యప్పటికి నెట్లయిన న
ట్టిద్యోదు నని గర్జనుం డియ్యకొనిన గోవిందుండును
ధర్మనందనాదులుం బ్రమోదంబు నొందిరి యవ్విధంబున శిబిరం
బున కరిగి పాండవులు పుండరీకాక్షుని నిజనివాసంబున
కనిచి తమతమనికేతనంబులకుం జని యారాత్రి సుఖనిద్ర
నేసి రని చెప్పిన సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

క. పాండుసుతు లేమిభంగి శి
ఖండిం గూర్చికొని యాప • గాసుతుపై ను
ద్దండగతి నడచి రెట్లు ప్ర
చండగతిఁ సమర కేలి • సలిపిరి చెపుమా. 314

భీష్ముని దశమదివసయుద్ధానుక్రమము.

వ. అనుటయు నాసూతనందనుం డతని కిట్లను సూర్యోదయ సమయంబునం బాండుసూనులు సేనాసమేతులై వెడలి మోహరించునప్పుడు మొనట శిఖండి నిలిపి యతని కెలంకుల భీమార్జునులును వెనుక నభిమన్యుద్రౌపదేయులును వారియిరువంకలం జేకితానశైనేయులును నటపిఱుంద ధృష్టద్యుమ్నాది పాంచాలకుమారుల మున్నిడికొని కవలనుభయపార్శ్వంబులం బుట్టికొని యుధిష్ఠిరుండును వీరసూరెలం బొదివికొని విరాటద్రుపదముఖ్యు లగుపృథ్వీపతులు ననేకయుపంచక ధృష్టకేతులును నిలిచి రిత్తెఱంగున గట్టిమోహరంబు దీర్చుకొని నడచి రంతకు మున్న మనవారును వెడలి భీష్ముం డగ్రభాగంబున నుల్లసిల్ల నీకుమారు లమ్మహాత్మునిం బరివేష్టింపఁగుంభసంభవతత్సంభవులు దక్షిణవామభాగంబులను గృపకృతవర్మభగదత్తపురస్సరుండై కురురాజు మధ్యభాగంబునను బృహద్బలకాంభోజముఖ్యులైన మహీపతు లమ్మనుజేంద్రు చుట్టును ద్రిగర్తులపరభాగంబునను బన్ని బలు మొన యమర్చికొని త్రోచి నడచి రిట్లిరువాఁగునుం గవిసి వివిధతూర్యస్వనంబులు నింగి ముట్ట నొండొంటిం దాఁకిన. 315

క. సమరం బప్పుడు దనుజులు
సమరులునుం బెనఁగుచందమై తోఁపఁగ భూ
రమణ విను మేమి సెప్పుదు
జముపురమున నగ్గలంపుసందడి యయ్యెన్. 316

వ. అట్టియెడ. 317

మ. కవ లుద్దామపరాక్రమస్ఫురణమైఁ ♦ గౌరవ్యసైన్యంబు సి
క్కువడం జేయఁగ భీమపార్థులును గో ♦ కొమ్మంచు నొక్కుమ్మడిం
గవియం బాండవసేనయుబ్బి యడరం ♦ గాఁ జూచి కల్పాంతభై
రవభీమాకృతి నేచి భీష్ముఁడు శర ♦ వ్రాతంబు గుప్పించినన్.

ఆ. కాలు కాలు పెనఁగి ♦ కాలుబలంబులు
నొడ్డగెడవు ఘోర ♦ ఘోత్కారంబు
మొగ్గతిలఁగ గుఱ్ఱ ♦ ములు నేలయఁద్రువ మా
తంగఘటలు గూలెఁ ♦ దక్షిణంబ. 319

క. కనుఁగొని శిఖండి వెస మా
ర్కొని భీష్ముని నేసె నూఁడు ♦ క్రూరాస్త్రములం
గని యతఁడు మరలి చూడక
తని నుద్దేశించి పలికె ♦ దరహాసముతోన్. 320

ఉ. ఎవ్వతనేని ధాత సృజి ♦ యించెఁ దగ మగవానిఁగాఁగ
నాక్రొవ్వమిఁ జేసి యట్టినిను ♦ నుగ్గలి నేయఁగ నొల్ల నా
పయిం గ్రొవ్వెసలార నీవు శర ♦ కోటి వెసం బరఁగిం
చినేని నేనవ్వుదుఁ గాని కోపము మ ♦ నంబునఁ బుట్టదు
సూ శిఖండినీ. 321

వ. అనినం గోపించి శిఖండియు నతని కిట్లనియె. 322

క. గెలిచితి రాజుల నెల్లను
బలియుం డగుపరశురాము ♦ ప్రతివీరుఁడ వై
యలవుకలిమి నెఱపితి నీ
చలము బలము నాకుఁ జూపఁ ♦ జాలవు కంటే. 323

క. ఏయు మొక నేర్పు మైని.
శ్లైమక క్రేడించి యరుగు ♦ మెట్టయినను మ
త్సాయకముల నినుఁ గూల్చెదఁ
జూ మెవ్వత నైతి నేమి • సూచెదు నన్నున్. 324

క. నేఁడిమ్మొఱ నైనను నీ
పోఁడిమి సెడఁదోన తవిలి ♦ పొదువుదు నిన్నుం
వాఁడిమగఁ డనుట యుడుపుదు
వేఁడిమిసొం పెసఁగ నస్త్ర ♦ విద్య మెఱయుచున్. 325

వ. అనుచు మఱియు నయిదమ్మ లేసె నప్పలుకులు విని ఫల్గునుం డాత్మగతంబున నేఁడు శిలండిచందంబు వింతయ యియున్నయది నదీనందనుండు సమయుటకు సమయం బైనదై వదత్యోత్సాహంబున నేచి పలికెం గావలయునని యూహించి యుపోద్బలంబుగా నతని కిట్లనియె. 326

అర్జునుఁడు శిఖండికిఁ బ్రోత్సాహంబు గలిగించి భీష్ముపైఁ గవియించుట.

ఆ. ఇట్టు లాడి పిదప ♦ నేమియుఁ జేయంగఁ
జాల కున్న మనల • జగము నవ్వు
నేను గలుగ నిన్ను ♦ నెవ్వరి కేనియుఁ
జేయ రాదు భీష్ము ♦ నేయు మడరి. 327

వ. అనియె నప్పుడు గాంగేయుండు దొలంగి పాంచాలంబులపైఁ దఱిమినం దెఱపి గని పాండవబలంబులు గాండీవియున్నుగాఁ గవిసినం గౌరవసేన దెరలి మరలినం జూచి కురురాజు సురనదీసూనుతోడ నీవు నలుగ మనసైన్యంబు దైన్యంబు నొందసగునే యనవుడు రారాజుతో నతండు. 328

క. మును పదివేవురఁ జంపుదు
నని యిచ్చినబాస వచ్చె • నవనీశ్వర నీ
మనిచినఋణంబు దీర్చితి
విను లావిట మీఁదఁ దఱుఁగు • సిధ్ధమైతోఁచెన్. 329

ఆ. నేఁటిభంగి సూడ • నృపవర పాండవు
లోఁడె నన్ను వారి • నోఁడె నేను
సమయఁజేత గలుగు • సమసెద రేయొక
మర్త్యుచేత వార • మర్త్యబలులు. 330

వ. ఐనను నాచేతిబలువు సూడుమీ యని పలికి పేర్చి
పటుతర శరార్చులం బ్రచండ నరనాథయూథంబులం
బొదివికొని పాండవులకుం దేఱి చూడ రాక నిర్ధూమ
దహనస్వభావుం డైన పితామహు పార్శ్వమున భవత్పుత్త్రులు
శత్రుబలంబుల బడలువడం జేయం దొడంగిన వారిం
గనుంగొని. 331

ఆ. పాండవేయమాత్స్య • పాంచాలయాదవ
పాండ్య కేకయాది • బలములొక్క
మొగిన క్రోవనీదు • మొనలుమార్కొనుట యు
నపుడుపోరు ఘోర • మయ్యె నధిప. 332

వ. అట్టియెడ నర్జునుండు శిఖండి నాలోకించి. 333

తే. నీవుభీష్మున కలికిన • బోవ దేను
గలుగ వెఱపేల యతనిపైఁ • గవియు మొదిది
కొనిమదీయ బాణంబులఁ • గుప్పఁ గూరఁ
బఱపికూల్చెద నీతనిఁ • బటురయమున. 334

వ. అసిన నాతనిపలుకులు విని యెలుంగెత్తి ధృష్టద్యు
మ్నుఁడు. 335

క. మనయోధు లందఱును శాం
తనవునిపైఁ దఱుముఁ డిఁదఱి ♦ తనయుఁడు గలుగన్
మనమతనికి శంకింపఁగఁ
బని లేదని పలికి యార్చి ♦ బలువిడి నడచెన్. 336

వ. అప్పుడు ధర్మజభీమనకుల సహదేవులును సుభద్రాతనయుఁడు
దౌపదేయులును ద్రుపదవిరాటులును సాత్యకిచేకితాన
ధృష్టకేతు కేకయమాగధులును మఱియునుం జేయం
గలరథికులు నొక్కపెట్ట బెట్టడరిన నిక్కడగురుపుత్ర
భూరిశ్రవసులును కృతవర్మకృపకాంభోజపతులును వికర్ణ
దుర్ముఖవివింశచిత్రసేనలును లోనైన యోధులు దేవవ్ర
తునకుం దలకడచి వారిం దలపడి రిట్లు మందాకినీనందను
పయింగవియుపాండవసైనికులను నతని కడ్డపడుకౌరవ్య
వీరులును జూచునెడ సురల కనిమిషత్వంబు సార్థకం
బయ్యె నయ్యవసరంబున. 337

క. మొనసి శిఖండిని మున్నిడి
కొని యురవడిఁ దరుమునరున ♦ కును వెసదుశ్శా
సనుఁ డడ్డపడియెఁ బొంగిన
వననిధికిని వేలవోలె ♦ వసుధాధీశా. 338

వ. ఇట్లు నిలువరించి. 339

క. ఇరువురఁ గృష్ణుల నాతం
డిరుపది బలునారసముల ♦ నేసెం గ్రోధ

స్ఫురితుఁ డయి నొంచెఁ గ్రీడియు
నరనాయక యతనినూటఁ ♦ నారాచములన్. 340

తే. అతఁడు నొచ్చియు నాటించె ♦ నైదుదూపు
లింద్రసుతుఫాలమున నాతఁ ♦ డేచివిల్లు
దునిమి పెల్లేయఁ దలఁకక ♦ దుస్ససేనుఁ
డన్యధనువున నిరుపదే ♦ నమ్ము లేసె. 341

క. ఆతూపులు నఱకి పరి
స్ఫీతం బగునారసంబు ♦ పృథుతరవక్షః
స్ఫూర్తంబు సేసి విజయుఁడు
నీతనయుని మూర్ఛపుచ్చె ♦ నిష్ఠురవృత్తిన్. 342

వ. అట్లు దుశ్శాసనుండు సోలి వ్రాలుటయు. 343

క. సారథి యరదము భీష్ముని
తేరివెనుక కెగిచె నంతఁ ♦ దెలివొంది ధృతి
స్ఫారుఁ డగునక్కుమారుఁడు
దారగతిఁ మగిడి వచ్చె ♦ తాఁకెం గ్రీడిన్. 344

వ. తదవసరంబున సాత్యకితో నలంబుసభగవత్తులును నభిమన్యుతో సుదక్షిణుండును విరాటద్రుపదులతో నశ్వత్థామయు సహదేవునితోఁ గృపాచార్యుండును నకులునితో వికర్ణుండును ఘటోత్కచునితో దుర్ముఖుండును భీమసేనుతో భూరిశ్రవసుండును జేకితానుతోఁ జిత్రసేనుఁడును ధర్మనందనుతో నశ్రుగురుఁడును దలపడిన బెట్టిదం బగు బవరంబయ్యె నందఱు వెఱఁగుల యోధులు నన్యోన్యధ్వజభంజనంబును బరస్పరతురగహాననంబులు నితరేతరసూత

నిపాతనంబును మిథః కోదండఖండనంబును జేయుచుండం బటుతర శరసంపాతసంపాదితశింపాజాలకాభీలంబును భీషణగుణరణనగర్జాస్ఫూర్జితంబును రక్తధారాసార ఘోరంబుననగునపూర్వపర్జన్యసమయంబు దోఁచ నప్పుడు గవ్యంబుకలయూ పంతయుం గనుంగొనుటకు మింటిక్రేవనున్న వెరవుగా దనుపరుసున సవితృండు చక్కనిమింటికిం జను దెంచె నట్టియెడ. 345

మ. పటుదుశ్శాసనబాణపంక్తి నతిద ♦ ర్పస్ఫూర్తిమైఁ ద్రుంచి
యుత్కటకోపానలదీ ప్తవక్త్రుఁ డగుచుం ♦ గాండీవి
పై ల్లేయుచుం| ద్రుటితజ్యాలతికాధనుర్ధ్వజుఁడు ని ♦ ర్లూ
నాఖిలాంగుండునై| రటదశ్వం బగు తేరితో నతఁడు సం
త్రానంబునం బాఱెనన్. 346

తే. ఫల్గునుఁడు భీష్ము నుందటి ♦ బలము లెల్ల
జటులరథవల్గనుం డయి ♦ చంపు చున్నఁ
జూచి ద్రోణుండుగుణరవ ♦ స్ఫురణఘూర్ణ
రోదసీభాగుఁడగుచుమూ ♦ ర్కొనఁగడంగి. 347

ద్రోణాచార్యు లశ్వత్థామయు భీష్మునకు సహాయంబుగాఁ బంపుట.

వ. అక్కడ నడచినం గాంగేయాగ్రజుండు తోడన తవలిసేనా సమేతంబుగా నడ్డపడి పోనీక పెనంగు చుండ నక్కుంభ సంభవుండు. 348

క. అప్పుడు క్రోధమునం గను
నిప్పులు రాలంగఁ దనకు ♦ నెఱసంగడ మై

గొప్పితనయున కిట్లని
చెప్పం దత్కాలగతిచిశేషము లెల్లన్. 349

చ. తడంబడె దివ్యబాణములతంత్రిము మంత్రముఁ దప్పెడుం
గడు । న్వడఁ కెడుఁ జాపదండము మనంబును నాకు వశం
బు గాదు వి । ద్వడిమెదుఁ జెయ్యు లంగము గడంక దొ
అంగెడు నేఁటిభంగిఁ గ । వ్వడి తనపూన్కి దీర్చుటధ్రు
వం బని బుద్ధిజనించెఁ బుత్రకా. 350

వ. అతనిమును మటు తెలదొత్తిచూపుము. 351

క. కూలెడు గుఱ్ఱంబులు ధర
వ్రాలెడు నేనుఁగులుఁ గెడయురథములు నై యా
భీలయుగాంతసముద్భట
కాలపుగోభాగరేఖ గానఁగ నయ్యెన్. 352

వ. అదియునుం గాక. 353

తే. అడరి కురుసేనపైఁ గద్దలాడఁ జొచ్చెఁ
బఱచుచున్నవి యుల్కాలిక్కడవినంగ
వచ్చెనతిరూక్షభంగిశివారుతంబు
లాపగానందనునకుఁ గీడావహిల్లు. 354

వ. యుధిష్ఠిరుమొగంబునం గ్రోధం బగ్గలంబై తోఁచుచున్న
యది ద్రౌపదేయనకులసహదేవసహితుం డగు తమ్ము
నతని మిగిలి నాకు రా రాదు నీవు దేవవ్రతుపాలికిం బోయి
యుతనికి దాపట వలపటం బ్రాపై నిలువు మిది ప్రాణం
బులు డాఁచుసమయంబు గా దని పలికి పనిచిన నశ్వత్థా
మ యుద్దామగతిం జనియె నక్కడ భీమసేనుండు. 355

క. నరుఁ డేచి శిఖండిఁ బుర
స్కరించుకొని యప్పుడు భీష్ము ♦ సమయింపఁగ స
త్వరుఁ డగుటయుఁ దగ రథతి
త్వరుఁడై కురుసేనమీఁదఁ ♦ దఱిమెం బెలుచన్. 356

వ. ఇట్లు దఱిమి గాంగేయుపుందటిబలంబుల బారిసమరం
బొడంగిన భగదత్తకృపకృతవర్మశల్యసైంధవ చిత్రసేన
దుర్మర్షణ విందానువిందవికర్ణులు పదుండ్రు నొక్కపెట్ట
యాతనిం బొదివి నానాస్త్రసంతానంబుల నొప్పించిన
నొచ్చియుం జలింపక పోరునమ్మారుతిం గనుంగొని
క్రీడితోడై తెఱియ నుఱికి ధనువులతునియలను బాణంబు
లపఱియలను కేతుచ్ఛత్రచామరంబులచెక్కలను భూషణం
బుల పోళ్ళను బుడమిం గప్పినం జూచి సుయోధనుండు
సుశర్మాదిభూపాలకుల నాలోకించి యాభీమార్జునులం
దాఁక నియోగించిన. 357

క. ముందటిపదుండ్రు నానృపు
లంటియునుం గూడి పెనఁగి ♦ యయ్యిరువురచే
తం దూలఁబోవఁ జొచ్చినఁ
గ్రందుగ బలుమొనల నెల్లఁ ♦ గవియం బనిచెన్. 358

వ. ఇవ్విధంబునం బెక్కుమొనలు పయింబడిన నయ్యిరువుర
కుం బోరు భరంబగుడు నెఱింగి సౌభద్రసాత్యకిప్రముఖు
లగురథికజనంబులు సైన్యోపేతంబుగాఁ ద్రోచి యేచిన.

క. పాండవబలములయుత్యు
ద్దండపరాక్రమము సూచి ♦ దర్పోద్ధతవే

దండములఁ గనిన కేసరి
చండత భీష్ముండు వొదివె ♦ శరనఖరములన్. 360

క. దోర్లెడుసూతులుఁ బెలుచం
ద్రెళ్ళెడుతురగములుఁ గా న ♦ తిక్రూరగతిం
బెల్లేయుచు సత్వరముగ
నెల్లెడలం దాన యగుచు ♦ నేడ్తెఱఁ బొదివెన్. 361

వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు విహరించి యపరాహ్ణం బగుట
యు నతం డాత్మగతంబున. 362

తే. ఉత్తమక్షత్త్రియులనెల్ల ♦ నుగ్రవృత్తి
నేఁడు పదినాళులేని నా ♦ నిశితశరచ
యములఁ గూల్చితి వేసరి ♦ నట్టు లయ్యె
మేనితోడి పొత్తిం కిట ♦ మానుటొప్పు. 363

వ. అని తలంచి తొలంగ బలంబులం దెరల్చికొనుచుం గ
య్యంబు సేయుచందంబునం గౌంతేయాగ్రజుం గదిసి
యుల్లన యతనితో నిట్లనియె. 363

క. జనియించినంతనుండియు
జనపతులం గ్రూరవృత్తిఁ ♦ జంపుచు నుండం
జనియెం గాలము విసివితి
ననఘా యే నింకఁ జాల ♦ నాసురవిధికిన్. 365

ఆ. మీరు నాహితంబు ♦ గోరుదురేని శి
ఖండి మున్ను గాఁగఁ ♦ గడఁగి యంత
వట్టువారు నొక్క ♦ పెట్టకాఁబెఁ బడి
యేయుఁ డింకఁ దడవు ♦ సేయవలదు. 366

వ. అని పలికి సమరప్రకారంబునం దేరు ద్రోళ్ళుదోలి పాం
చాలబలంబులపయి నడచె నవ్వం డయ్యాజాతశత్రుండు
సమీపవర్తియగుధృష్టద్యుమ్ను నాలోకించి. 367

క. దేవవ్రతుపలుకులు విం
టే వేగమ పనుపు మొక్క • టిగఁ దఱుమఁగ యో
ధావళి నెల్లను భీముఁడు
నీవును నరుతోడఁ గూడి • నిగుడుఁడు పెలుచన్. 368

వ. అనవుడు నతండు. 369

సీ. మాత్స్యకై కేయాది ◦ మనుజేంద్రులకుఁ జేయు
గలయట్టియోధవీ • రులకుఁ జేయి
చూపి మరున్నదీ సూనుపైఁ గవియింపఁ
బవనజపార్థుల • ప్రాపుకలిమి
వెఱ పేది యందఱుఁ • దఱుమఁ గౌరవపతి
తమ్ములు దొరలును • దానుఁ దాఁ
గడచి తాఁకినఁ బోరు • ఘన మయ్యె నప్పుడు
సౌభద్రుఁడమ్మహీ • శ్వరుని నొంచె

తే. ద్రోణతనయుండు శైనేయు • బాణమయశ
రీరుఁ గావించెఁ జేదీశ • పౌరవులన
మానఘోరాక్రమం బొప్పె • మారుతాత్మ
జుండు రారాజునేనిక • పిండుఁ జదిపె. 370

వ. మఱియు నందు చిందును మందాకినీనందనుపయిం ద్రోవను
నతనిం గావను దలంచి కడంగిన సైనికు లనేకులు నానా
ప్రకారంబుల వివిధాయుధంబులం బెనంగు చుండ. 371

క. మొనసి మృగేంద్రము మృగేంద్రుఁడు
సెయనం జనుపగిది నరుఁడు ♦ శీఘ్రగతిన్ శాం
తనవుపయిఁ గవియ దుశ్శా
సనుఁ డడ్డము సొచ్చె దేవ ♦ సంఘము వొగడన్. 372

ఆ. అతనికప్పు డెదుర ♦ నమ్మొన నెవ్వరుఁ
జాలరైరి సవ్య ♦ సాచి యొకఁడ
నిశితవిశిఖపంక్తి ♦ నిగిడించి నొప్పించి
యొత్తిభీష్ము వెనుక ♦ కొదుఁగఁ జేసె. 373

వ. తదవసరంబున సరభసంబున నడరిన. 374

క. భగదత్తుని నాకవ్వడి
వెగడొందఁగఁ జేసియతని ♦ వెల్లేనుఁగుఁ గెం
పుగఁ జేసిన నాతండును
నిగిడెం బాంచాలమేది ♦ నీపతిమీఁదన్. 375

వ. ఆఖండల నందనుండును శిఖండిం దఱిమి తెఱపి సూపి
దేవవ్రతు నేయు మని పురికొలిపె నంత. 376

క. మన యోధప్రకరము శాం
తనవుం దలకడచి యత్యు ♦ దగ్రత నయ్యు
ర్జునుఁ బొదివె నతండలిగినఁ
బెనుగాలిం దూలు మొగిలు ♦ పిండును బోలెన్, 377

ఆ. అట్టియెడ శిఖండి ♦ యాపగాసుతుమీఁద
వాలుటమ్ము లేయ ♦ వాని నేయ
నొల్లకతఁడు గెలని ♦ యోధవీరావళి
నేయుచుండె శౌర్య ♦ మెసక మెసఁగ. 378

క. నగుఁడు శిఖండిం దఱిమిన
శరము లతఁడు భీష్మునురుభు ♦ జామధ్యమునం
గురియఁగ నవ్వుచునుండెం
గరి యంత్రజలంబు దొరఁగఁ ♦ గా నున్నక్రియన్. 379

వ. ఇట్లు దేవవ్రతుండు శిఖండి యేయుట సరకు సేయక యతం
డగ్గ మైన నేయక సాయకంబులు సవ్యసాచిపయి నిగ్ర
హింప మగిడి దుశ్శాసనుండు గడంగి కవ్వడి నెగడుపడునంత
కయ్యంబు సేసినొచ్చిపాసినఁ గౌరవపతిగనుంగొని యెలుంగు
సూపి చేయి వీచి పురికొల్పినం గళింగమాళవబాహ్లీక
విదేహశూరసేనప్రముఖబలంబులు బలమర్దను తనయుదె
సకుఁ గవిసిన. 380

తే. అతఁడు దివ్యాస్త్రజాలంబు ♦ నతిశయంబు
సూపి చతురంగబలముల ♦ రూపుమాపి
యుఱక తఱిమి సిఖండికిఁ ♦ దెఱపి సూప
వాఁడితూపులు భీష్ముపై ♦ వాఁడు నినిచె. 381

వ. ఆసమయంబునం గృప శల్య వివింశతి వికర్ణులం గూర్చి
కొని పేర్చి దుశ్శాసనుఁడు శాంతనవున కడ్డపడినం బార్థుం
డయ్యేవురను విరథులం జేసిన. 382

క. కురుపతియు ననుజవర్గముఁ
బరమక్రోధమునఁ దెంపు ♦ బలుపును మెఱయన్
సురనాథనందనునిపై
నురవడిఁ ద్రోచుటయు సేన లుగ్రత నడరెన్. 383

క. పాండవబలములు దలపడి
భండన మొనరింప నగ్ర ♦ భాగంబున ను
ద్దండతఁ బోరెడుమనుమల
తండము గని మెచ్చి య ♦ ప్పితామహుఁడు వెసన్. 384

తే. అరిబలంబు పై నొక్కడి ♦ వ్యాఘ్ర మేచుఁ
దలఁచి యరిఁబోసి తిగిచి యు ♦ దగ్రవృత్తిఁ
గవిసి ముంపల నున్న శి ♦ ఖండిచూడ్కి
దోడరుటయుఁ దాల్మి మైఁ దెగ ♦ యుడిపె నధిప. 385

వ. అంత. 386

క. సోమక మాత్స్యప్రముఖో
ద్దామబలము లేచి పెలుచఁ ♦ దఱుముటయును సం
గ్రామతలము సేనాంగ
స్తోమాంగమయంబు సేసె ♦ దుర్దాంతగతిన్. 387

క. సేనల నిమ్మెయి భీష్ముఁడు
దీనత బొందింప నలిగి ♦ ధీరత్వము వీ
రానీకం బగ్గింప శ
తానీకుఁ డెదిర్చె నతని ♦ నాసురభంగిన్. 388

— విరటు తమ్ముఁడగు శతానీకుండు భీష్మునిచేఁ జచ్చుట. —

వ. ఇట్లు దాఁకి విరటుతమ్ముఁడు వాలమ్ముల నొప్పించినం గో
పించి. 389

శా. విల్లుం గేతువుఁ ద్రుంచి సూతు వెస ను ♦ ర్విం గూల్చి
రథ్యంబులన్ ।డొల్లన్ దీవ్రత నేసి యాతఁడు భుజా ♦ టో
పంబు శౌర్యంబు శో । భిల్లన్ వైచిన శక్తియుం దునిమి

యా ♦ భీలద్యుతిప్రస్ఫురద్భల్లం బొక్కటి భీష్ముఁ డేసి నఱ
కెం ♦ దన్మస్తకం బుగ్రతన్. 390

వ. ఇవ్విధంబున శతానీకుం జంపిన. 391

క. మొన లెల్ల విఱుగ మత్స్యం
దినమునయినమాఁడ్కిఁ బయలఁ ♦ దేజోనిధి శం
తనుసూనుఁ డొప్పె నప్పుడు
గనుఁగొని యిట్లనియె శౌరి ♦ గాండివితోడన్. 392

క. మన మీహారములు సెడి కను
కనిఁ బాఱెడు నిప్పు డావ ♦ గాసుతునకు గ్ర
క్కున నీవు మార్కొనక త
క్కినఁ గార్యము దప్పఁ బోదివి ♦ గెలువుము కడఁకన్. 393

వ. అనిన విని యతండు రథరథ్యసారథిసహితంబుగా సురనదీ
నందను నమందమార్గణ పుంజంబునం బొదివె శిఖండియుం
జేరి నారాచంబుల నొప్పించిన దేవవ్రతుండు వాని నేయ
నొల్లనిసందున నాసవ్యసాచి యతనివిల్లు దునిమి పెల్లేయు
చున్నం జూచి సైరింపక శల శల్య కృప కృతవర్మ చిత్రసేన
భూరిశ్రవఃప్రభృతివీరలోకం బతలోకంబుగ దివ్యాస్త్రజా
లంబులు నెఱపుచు నేయుచు భీష్మున కడ్డపడుండు దలకడ
వుం డను నెలుంగులు నింగి ముట్ట బలసమేతంబుగా నడరి
రినం గని సమీరనందనసాత్యకిసౌభద్రవిరాటద్రుపదఘటో
త్కచప్రముఖయోధవర్గం బనర్గళభంగిం దఱుమం దత్సై
న్యంబులు గూడుకొని కవిసిన దివిజదానవసంపాతసమ
రం బయ్యె నందుఁ బురందరనందనుండు మనసైనికుల శం

దఱు కన్నిరూపు లయి యైంద్రవారుణాగ్నేయాది మ
హాశరంబులఁ దెరల్చుచు సురక్షితుండైన శిఖండిం బురి
కొల్పికొని కిరీటి డాయుచుఁ నతం డన్నివిండ్లుత్రిన
నన్నిటిం దోడ్తోన తునుమాడుచుండె నా క్రీడిపై నతండు
గ్రశక్తి ప్రయోగింప నదియును ద్రుంచి సూతునిం గేతు
నంబునుం గూల్చిన, 394

సీ. మనమున భీష్ముఁ డి ♦ ట్లని వితర్కించుఁ బాం
డవుల నాయొక్కవిం ♦ టన కడంగి
గెలువనే వీరికిఁ ♦ గృష్ణుండు ప్రాపు గా
కున్న సు ... లుండ నిమ్ము
కృష్ణుఁ దోడుగఁ గొని ♦ కీడ్పడి వీరలు
వచ్చినఁ జెప్పిత ♦ వధవిధంబు
సమర ముపేక్షించి ♦ శాంతియై నుండెద
నడిచిపాటటికి ♦ ననఁగ నెఱిఁగి

తే. చదల సురలిట్టు మేలిది ♦ సమ్మతంబు
మాకు నని ప్రీతిమైఁ జెప్ప ♦ మాటలాత్రఁ
డొక్కరుండును వినియె నే ♦ నొక్కఁడు వింటి
మునిమహానుభావంబున ♦ మనుజనాథ. 395

వ. తదవసరంబున సూక్ష్మజలశీకరశిశిరం బగుమారుతంబు
మరుత్తటినీతనయునిమీఁద నుడిసె సురదుందుభులు మ్రో
సెఁ గుసుమవర్షంబులు గురిసె నవియు ననన్యగోచరంబు
లయ్యె నిట్లు నిశ్చయించియు నమ్మహాత్ముం డూరకున్నం
గెలని కొంకభంగమై తోఁచు నని తలంచి. 396

తే. ఒక్కవిల్లెక్కువెట్టంగ • నుఱక వెస శి
ఖండిపటుమార్గణంబులఁ ♦ గడఁగి యేయ
నతఁడుమిసిమింతుఁడును గామి ♦ కల్లనవ్వి
పఱపెఁ దనయమ్ములతనిపై ♦ ఫల్గునుండు. 397

వ. శాంతనవుండును సముల్లాసంబున నేసిన. 398

క. నరుఁడు పనమీఁదఁ దొరఁగెడు
శరములు వారించి యతని ♦ చాపం బధిక
త్వరితగతిఁ ద్రుంచి యతని
స్ఫురనారాచంబు దనువు ♦ సొఱ నేయుటయున్. 399

వ. తమకుఁ దమయోధవరులకుఁ వారింపం జేరం జనయుం
గాలంది కాక వెల్లివిరిసిన శరనిధిభంగిం బొంగినవివ్వచ్చు
వెఱఁగుపడి చూచుచుఁ దన్నువిడువక కెలంకుల నున్న
కొడుకులం గనుంగొని మీంతండ్రి రారాజుతో నిట్లనియె.

మ. అని దేవాసురకోటికైనను నశ • క్యం బిమ్మహావీరు మా
ర్గాన పీఁ డల్గిన మర్త్యు లేరెదు రుదా♦రుం డైన యీ
క్రీడి దక్కిన నిప్పాండవసైన్య మింతయును గ్ర ♦ గ్గింప
గ నే జాలుదుఁ | విను సత్యంబిది పీనివింటి కెదురఁ
విల్లెత్తలేఁ డెవ్వఁడున్. 400

క. అనునెడ శిఖండిచాపము
వెనుకం ధనవిల్లు నిల్పి ♦ వెస నాతం డే
సినభంగిగ నరుఁ డేసెను
జననాయక దొడ్డనార♦సంబుల భీష్మున్. 402

వ. అప్పుడు దేవవ్రతుండు దుశ్శాసను నాలోకించి. 403

సీ. అశనికల్పము లివి ♦ యర్జునుబాణముల్
గాని శిఖండివి ♦ గావు సుమ్ము
కర్కటి గర్భంబు♦కరణి గాత్రము వచ్చి
నిట్టివి వీనికి ♦ నెందుఁ గలవు
బ్రహ్మదండంబుల♦పాటివై మర్మంబు
లిట్టు నో నాటు నే♦యితనిచేతి
జముదూతలట్లు ప్రా♦ణముల వెలార్పంగ
క్షీద్రుపదాత్మజుఁ ♦ డెన్నఁడేసె

ఆ. దృఢవిముక్తములును ♦ దీప్తాకృతులు లక్ష్య
శుద్ధిమంతములును ♦ సుశితములు
నైన నారసంబు ♦ లతనివి గాక యీ
తనివి యగునె యెవ్వి♦ధమునఁ జూడ. 404

క. అనుచుఁ బటుశక్తి నవ్వా
రుని వైచిన నది యతండు ♦ మహామాడుసు శాం
తనవుఁడు వాలుం బలకయుఁ
గొని యరదము డిగ్గఁజూచు♦కొలఁదిం బెలుచన్. 405

తే. ఏసి యా రెంటఁ దునియలు ♦ సేసి యెలుఁగు
సూపి యేనుండ వెఱ వేల ♦ నాపగాత
నూజుఁ బొడువుఁడు మీ రని ♦ యోజఁ జెప్పె
శక్రతనయుండు దనయోధ♦జనుల కెల్ల. 406

వ. అప్పలుకు లాకర్ణించి.

క. ఏయుఁడు పొడువుండు పొడువుఁడు
వ్రేయుఁడనుచు వారు జాహ్నవీతనయుఁ గవిసె

డాయుడు మన సైనికులుం
గోయని తలపడ్డఁ బోరు ♦ ఘోరంబయ్యెన్. 408

వ. అప్పుడు. 409

తే. ఏచి గాండీవి కురుసేన ♦ నెగవ నతని
నారు వెఱవక భీష్ముసిఁ ♦ జేరి యొడల
వ్రేలెఁడెడ లేనియట్లుగ ♦ వివిధభంగి
నిష్ఠురాస్త్రశస్త్రంబుల ♦ నిలిచి రథిప. 410

భీష్ముఁడు శరతల్పగతుఁ డగుట.

వ. అంత నంశుమంతుఁడు శాంతుం డగుచునచ్చె నట్టియెడం గదిసి కవ్వడి గాంగేయుపైఁ గ్రూరనారాచనికరంబులు నిగిడించి పడఁద్రోచిన. 411

క. తూర్పుతల గాఁగ నీసుతు
లేర్పడఁ గనుఁగొనుచు నుండ । నిల గంపింపఁగ
దర్పోజ్జ్వలుఁ డాభీష్ముఁ డ
హార్పతి యస్తాద్రి నేరు ♦ నట్లుగఁ బడియెన్. 412

తే. తనువు ధరఁ బొంద కుండఁగఁ ♦ దల్పభంగి
శరము లూఁతయై పొలుపారె ♦ నరవరేణ్యా
యట్లు శరతల్పగతుఁ డగు ♦ నమ్మహాను
భావు దేవవ్రతుని దేవ ♦ భావమొందె. 413

చ. అనిమిషు లప్డు సూచి మృతుఁ ♦ డయ్యెడు నక్కట దక్షిణాయనం । బునఁ గృతపుణ్యుఁ డంచు వగఁ ♦ బొందిన భీష్ముఁ డెఱింగి వారి కి । ట్లను సురలార కాలగతి ♦ నాత్మ

దలంచియుఁ గాదె మేదినిలో । ననిచినవాఁడఁ బ్రాణముల ♦
నుత్క్రమింపఁగఁ దలఁచు కేళియున్. 414

వ. సత్యవతీవివాహంబు సేయుటకు మా తండ్రి మెచ్చి యవధ్యత్వంబును స్వచ్ఛందమరణంబును నిచ్చినవాఁడు గావున దద్వరప్రభావంబున నావధంబున కేనొడంబడక కానేరదయ్యెఁ బ్రాణంబులు నావశంబ యనిన విని వారలు సంతోషించి యాసమయంబున భాగీరథీతనువున నొందఱు మునివరులు హంసరూపంబుల నమ్మహాత్మునకు దక్షిణాయనంబు వెడలింపం జనుదెంచి యతండు దెలిసియునికి నానిచేత నెఱింగి ప్రియంబు వడి యేఁగి రట్టియెడ దుర్యోధనుండు పుచ్చిన దుశ్శాసనుండు గుంభసంభవుపాలికిం బోయి భీష్ము పాటు సెప్పిన నతండు మూర్ఛిల్లి యొక్కింత దేఱి దీనాననుం డగుచు నమ్మహీనాథుకడకుం జనియె న య్యవసరంబున 415

సీ. పాండవేయులు మాఱ్స్య ♦ పాంచాలయాదవ
సహితంబుగా సంత ♦ సమునఁ బొదలి
రాఁ జెన బొబ్బలు ♦ నార్పులు బహుతూర్య
కోటియుఁ జెలఁగెనీ ♦ కొడుకుగమియు
నీదిక్కుదొరలును ♦ నెఱుఁ గత్తియేద్వంగ
నంబరచరులహా ♦ హారవంబు
లులియంగ రోదసి ♦ గలయంగ నట్టును
ఖనశబ్దమయమయ్యె ♦ మనుజనాథ

తే. కాలు సేయార్పుటలు లేక ♦ కన్నుఁగవల
నశ్రు లొలుకంగఁ జిత్తంబు ♦ లడలఁ బాండు
సూనుతతిఁ జూచు చుండిరి ♦ గాని యించు
కయును గడఁగరు మనవారు ♦ గర్వమునకు. 416

వ. తదనంతరంబున సంబరమణి యపరరత్నాకరంబు సొచ్చె
ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 417

క. నాయుల్ల మరయ నిను మో
డాయో కాకిట్లు రూప ♦ డక విన నేర్చెఁ
సాయకసముదయశిరభవ
దీయవచనచయము గవియు ♦ దేరం దిరమై. 418

వ. ఇంక నేమేనియుం జెప్పఁగొఁ తగలదే యనుటయు నాసూత
నందనుం డిట్లనుసప్పుడు కౌరవులుం దారును దమవారును
మొముఖవు లూడ్చి యాయుధంబులు వెట్టి గంగేయు
కడకుం బోయిరి కౌంతేయులు నట బంధుమిత్రసహితు
లయి యచటికిం జనిరి ధనంజయుం డొకరుండును ధను
స్పాణియై యరిగె నిట్లయ్యిరు దెఱంగులవారలుఁ దత్కా
లప్రశాంతస్వాంతులై యన్యోన్య విషయరోషంబులు
దక్కి తన్నుం బరివేష్టించినం గులగురుం డగునమ్మాదాక
నీనందనుండు వారి నభినందించి కొలిపించికొని యుండె.

తే. తనకుఁ గ్రీడల యని భవ ♦ త్తనయులకు నె
ఱుంగఁ జెప్పిన వారు గ ♦ డంగి మొత్త
దనము గలతలగడలు దేఁ ♦ బనుచుటయును
జూచి చిఱునవ్వుతో సవ్య ♦ సాచిఁ బిలిచె. 420

. పిలుచుటయు నతఁడు బొప్పము
లొలుకఁగ గాండివము వెట్టి ♦ రొయ్యనచనినం
దలగడతూపులు సెజకు
నలవడ, శెట్టు మని భీష్ముఁ ♦ డాత్రినిఁ బనిచెన్. 421

వ. ఇట్లు వనిచినం బార్థుం డట చేయుదు నని గాండీవంబు వుచ్చికొని మఱియు ననుజ్ఞ గొని మూఁడువాలమ్ము లభి మంత్రించి పెడతలఁ దాఁకి యెత్తి పట్టుకొని పుంఖంబులు భూమి మోచి నిలుచునట్టుగా నేసినం దాత క్రీతుండై తల్పంబునకుం దగినయుపధానంబు వెట్టె తని యుతనిం గొనియాడి సకలపౌత్రులను ధాత్రీపతులను నవలోకించి.

క. ర(విగొల్పి యుత్తరాయ.ణ
మివ్వన తెకు నంపవాన్పు ♦ నం దిల్లుమహాహా
త్సవలీల నిలుతు నాకీ
డినసంబులఁ జేయవలయు ♦ దృఢరక్ష దగన్. 423

క. అలయు కరయు నోపిననా
రలు గ్రక్కునఁ బరిఘుతోడి ♦ ప్రాకారం బి
ట్టలముగఁ గావింపు డనుడుఁ
దలకొని నీసుతులు ( బాండు ♦ తనయులు భక్తిన్. 424

ఎ. అత్తెఱంగాచరింపనుం దాత్పర్యంబున రక్షింపనుం దమ తెమయుఁడుఁ దగినవారల నియోగించి రంతఁ జికిత్సకులు వచ్చి శల్యచికిత్స సేసెద మని తొడఁగిన గాంగేయుండు వారించి వారి కభిమతార్థంబు లొసంగి వీడుకొల్పె గీత వాద్యనృత్తప్రవీణంబు లగుపాత్రంబు లమ్మహాత్మునకు

వినోదంబు సలుపుచుండె నట్టియెడ నా దేవవ్రతుండు నీళ్లు ద్రావ నడిగినం దనుపాయని రనేకులు గొనివచ్చిన నతండు. 425

తే. వి్యుడు శరతల్పగతుండ నై ♦ యునికిం జేసి
యన్యసలిలంబు సేవింప ననుచితంబు
నాకుం దేజోమయాస్త్రవి ♦ న్యాసవిధిస
ముద్ధృతంబైన భూజల ♦ మొకటఁడు దక్క. 426

వ. అనుటయుఁ గౌరవులును దక్కటిరాజులును వెఱఁగుపడి యున్నం గవ్వడిం గనుంగొని గాంగేయుండు. 427

క. శరవేదన సర్వాంగము
నెరియంగ నాకిపుడు పెదవు ♦ లెండెడుం దృష్ణా
భర ముడుపం దగిననీళులు
వెరవునం దే నేర్తు వీవ ♦ వే తెమ్మనఘా. 428

వ అనిన నట్ల కాక యని యతం డతనికిం బ్రదక్షిణంబు సేసి తేజోమయంబయిన మార్గణంబు పర్జన్యమంత్రాభిమంత్రితంబుగావించి మహీతలంబు గాడ నేసిన భాసురచ్ఛాయం బగుతోయంబు ధారారూపంబున దివ్యగంధరసోపేతం బయి యెగసిన. 329

ఆ. కౌరవులు ప్రకంప ♦ గాఢవిస్మయులైరి
పాండుసుతులు వారి ♦ బలము నుబ్బి
యార్చి సంకులొత్తి ♦ రాజలంబుల నమ్మ
హాత్ముం దృప్తుం జేసె ♦ నర్జునుండు. 304

వ. ఇట్లు తృప్తిబొంది మందాకినీనందనుండు పురందరనందనున
కిట్లనియె. 431

ఉ. నారదుచేత విన్న ముని ♦ నాథునిఁ గాఁగ నెఱింగి యుం
డుదుర|శౌరియు నీవుఁ గూడిన న ♦ సాధ్యము లెవ్వియు
లేవు దర్పదు|ర్వారుఁడ వైననీవలని♦వైరము గీడని చెప్పఁ
జెప్పనీ | కౌరవరాజు మానఁడు దె ♦ గం జెముఁ గా కిట
మీఁద భీముచేత. 432

వ. అని పలికి దీనవదనుం డగు చున్న భవమ్యానుతో నిట్ల
నియె. 433

మ. నను ఁ డత్యద్భుతవిక్రముం డతని కా ♦ నాగాయుతుం డా
పుఁ డె|వ్వారికిఁ వీరి జయింప రాదు నమరా ♦ వష్టంభ
ముం దక్కి ధ|ర్మరతుం డైనయజాతశత్రునకు నిం♦ద్రప్రస్థ
మి మ్మర్ధరా|జ్యరమం బొందుము మీరు గొంద అయినం
♦ జాతున్న నీ కొప్పదే. 434

వ. అని పలికి యూర కుండినం గౌరవపాండవులును మాఱు
పలుకక యతనికి నమస్కరించి నిజనివాసంబులకుం జని
రట్లు సను నెడ గోవిందుండు గాంగేయాగ్రజుం గనుం
గొని. 435

క. సురలకు నజయ్యుఁ డగునీ
సురసరిదాత్మజుని గెలువఁ ♦ జొప్పడునే యె
వ్వరి కైన నద్భుతావహ
పరికరు లగుమీకుఁ దక్కఁ ♦ బౌరవముఖ్యా. 436

క. అనుటయు నతఁ డిట్లను నే
మనఁగా నొకమానుసులమె ♦ యప్రతిహతపౌ
రుని నిన్నుఁ బడసి యింతటి
పనులకుఁ జాలితిమి గాక ♦ భక్త్యాధీనా. 437

— కర్ణుండు భీష్మునియొద్దకుఁ బోయి వినతుం డగుట. —

వ. అని యిట్లయ్యిరువురు నొండొరులం బ్రశంసించుచు నఖిల జనపరివృతులై శిబిరంబుల కరిగిరి తదనంతరంబ కర్ణుండు గాంగేయుకడకుం బోయి భక్తివినయంబులు దోఁపం బాదప్రణామం బాచరించి. 438

ఆ. అలుక దక్కి నన్ను ♦ నధికవాత్సల్యశీ
తలము గాఁగఁ జూచి ♦ తగినమాట
లాడవే మహాత్మ యనుటయు నాతండు
గారవమున నతనిఁ ♦ జేరఁ బిలిచి, 439

వ. ఒక్క కరంబు మలంచి కౌఁగిలించికొని యచ్చట నున్న రక్షకాదిజనంబుల నవ్వలం బోవం బనిచి యతనితో నిట్లనియె. 440

క. నీ దెసఁ గోపింతునె కుల
భేదముగాఁ బలుకుటయును ♦ బిడ్డలఁ జెఱుపం
గా దని కినియుదు లే దన
రాదలఁతును నిన్ను నిష్ఠు ♦ రంపుఁ బలుకులన్. 441

వ. అది శిక్ష గాని రోషంబు గా దట్లుం గాక. 442

క. నీయుదయము దైవికగ
ర్భాయత్తము నీకు మర్త్య ♦ లసదృశులు గాం

తేయుఁడవు గాని విను రా
ధేయుండవు గావు నీవు • ధీరవిచారా. 443

వ. ఇదికృష్ణద్వైపాయనుండు నాకు నేకాంతంబున నెఱింగించె సే
నను భవదీయతేజోవిశేషంబువలననుం గనుంగొనియుండు
దుఁ బాండుతనయుండ వగుటం జేసి నీయెడవాత్సల్యంబ కాని
మాత్సర్యంబు లే దొక్కటి సెప్పెద విను మేను గురుపాండుల
వైరంబు సీపి పుచ్చితి నప్పాండవేయు లజయ్యు లప్రమే
యుం డగుకృష్ణుండు వారికి విధేయుండు గావున వారల
తోడివిరోధం బొప్పదు నీవును నొండుదలంపుదక్కి య
క్కౌంతేయులం గలసి యుండు మసినం గర్ణుం డతని కి
ట్లనియె. 444

క. కౌంతేయుండ నగుదు నది
యంతయుఁ దొల్లియును వింటి నార్యులచే ని
ట్లింతయు నెఱిఁగినఁ గుంతీ
సంతానము తోడిపొత్తు • సను నేనాకున్. 445

ఉ. వారు మహాబలుల్ వారియు • వారికిఁ బ్రాపు గలండు
వారలం | బోర జయింప రామియును • బుద్ధి నెఱుంగుదు
నైనఁ గౌరవ | క్ష్మారమణుండు సేయుతగు • మన్నన లెల్లఁ
దలంచి చూచినన్ | భూరివివేక యే విడిచి • పోవుట ధర్మ
మె వీరకర్మమే. 446

వ. అదియునుం గాక. 447

ఉ. మాటలు పెక్కులాడి యను•మానము లేక సభం గడంగి
ప | ల్మాటుఁ బరాభవించితిఁ జ • లంబునఁ బాండవకోటి

కెప్పుడుం | జేటు దలంచి యే బలువు ♦ నేసితి వైరము నాకు నింక నీ | పేటికి వారిపేటికిని ♦ వెక్కస మయ్యెడు కయ్య మొప్పగున్ 448

శా. దైవాధీనము సర్వమున్ మనమతిం ♦ దప్పింపఁగా వచ్చునే| నీవింకన్ నను నొంచు వల్కుక పరా ♦ నీకంబు పైఁబంపు మ♦ త్స్వాధర్మము నిర్వహించెదబలో . త్సేకం బులోకంబు సం| భావింపన్ విహరించెదన్ మురరిపుం ♦ బార్థుం దలంకించెదన్. 449

చ. అన విని భీష్ముఁ డిట్టులను • నంతకుఁ జాలు టెరుంగనే నుయో|ధనునకు నెవు నీదుభుజ♦దర్పమ కాదె సహాయ మె ద్దియా|తనికిఁ బ్రియంబు దానిన యు ♦ దాత్తమతిం దగ నాచరింపునీ మనముసంతసిల్లు మను ♦ మానము దక్క మనుజ్ఞ యిచ్చితిన్. 450

వ. అని తెలి వొంది పలికిన దేవవ్రతుబంధుభావంబునకుం బర మానందంబు నొంది రాధేయుండును నిజనివాసంబునకుం జనియె నని సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పెనని జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు. 451

ఉ. మర్దిత తాపసంకలన♦మంజులనామ దురంతదుర్దశా కర్దమలేపనిర్హరణ♦కారికృపామృత పూరకర్మస మ్మర్దనిరాసకర్మఠ స♦మత్వపరిస్ఫుటరూపభావనా నిర్దళితారివర్గ మహ•నీయమనోరమణీయవైభవా

క. భసిత పరభాగహేలా లసితశ్రీవత్సలలిత♦లాంఛన పింఛ

ప్రస్ఫురదరుచిరబలోరగ
విస్ఫురదీధితకలావిశేషితమాళీ. 453

మాలిని. స్ఫురణరహితవృత్తీ ♦ గ్రాహ్యాభక్తప్రవృత్తి
కరణగమనలీలా ♦ గాఢకారుణ్యశీలా
స్మరణశుభదమూర్తీ ♦ మధ్యరశ్మిప్రవర్తీ
చరణవినమదింద్రా ♦ సంతతానందసాంద్రా. 454

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం
బయిన శ్రీమహాభారతంబున భీష్మ
పర్వంబునందు సర్వంబును
దృతీయాశ్వాసము.

శ్రీమదాంధ్రమహాభారతమునందలి
భీష్మపర్వము సమాప్తము.

